# దేవీ చతుష్షష్టి పూజా విధానం




M.Srikanth Sharma
Director

Cell: 9849485645





హిందూ ధర్మచక్రం

www.hindudharmachakram.com


 msksharma108@gmail.com  hindhudarmachkram

మనం ఎక్కువగా షోడశోపచార పూజ గురించి వింటాము. కానీ ఈరోజు చతుశ్శష్టి పూజ గురించి తెలుసుకుందాం ! దేవతా ఆరాధన విషయంలో 16, 32, 64 ఉపచారాలు కూడా ఉన్నాయి.

షోడశోపచారాలు అంటే 16 ఉపచారాలు. ఇవి సాధారణంగా అన్ని సందర్భాల్లో చేస్తూ ..చూస్తూ ఉంటాము. చతుశ్శష్టి ఉపచారాలు అంటే 64 ఉపచారాలు. చతుశ్శష్టి పూజ విశేషమైన రోజుల్లో విశేష పూజల్లో జరుపబడుతాయి. వరలక్ష్మి వ్రతం వినాయక వ్రతం దేవీ నవరాత్రులలో ఈ విధానం చేయడం జరుగుతుంది. షోడశోపచార పూజకు ఇది 4 రెట్లు అధికంగా ఉంటుంది. చివరలో జోలపాటతో భగవంతుణ్ణి నిద్రబుచ్చడం కూడా ఉంటుంది.

ఏమాటకి ఆమాట చెప్పాలి. ఈ చతుశ్శష్టి పూజ చేస్తుంటే చెప్పలేని ఆనందం ఉంటుంది. విశేషించి అమ్మవారి పూజలో అయితే అమ్మవారికి కాటుక సింధూరం గాజులు పారాణి ఆభరణాలు అద్దము కేశాలకు సాంబ్రాణి వేయడం కాళ్ళకు పాదరక్షలు ఇవ్వడం ఏక హారతి కుంభ హారతి ఇవ్వడం జోలపాట పాడడం ఇలా ఒక్కోటి మంత్ర యుక్తంగా చేస్తూ ఉంటే ఆ ఆనందం అనుభవించాల్సిందే కానీ చెప్పలేము.

మరెందుకు ఆలస్యం ... పూజలోకి వెళ్దాం ! హిందూ ధర్మచక్రం

# ! విజయ దశమి మరియు నవరాత్రుల ప్రాముఖ్యత !

ఆశ్వయుజ శుద్ధ ప్రతిపది నుండి విజయ దశమి వరకు అమ్మవారికి జరిపే ఉత్సవాలని దేవీ శరన్నవరాత్రి ఉత్సవాలు అంటారు. శరదృతువు ప్రారంభ కాలంలో వచ్చేవి కనుక

'' శరన్నవరాత్రులు '' Sharannava Ratri అంటారు.

దేవీ భాగవతం ప్రకారం కొన్ని వ్రతాలు పేర్కొనబడినాయి.

అనంత తృతీయ వ్రతము, రస కళ్యాణి వ్రతము, ఆర్ద్రానందకర వ్రతము, సోమవార వ్రతము, మంగళవార వ్రతము, శుక్రవార వ్రతము, ప్రదోష వ్రతము మరియు నవరాత్రి వ్రతము. ఇప్పుడు మనం తెలుసుకోబోయేది నవరాత్రి వ్రతం గురించే.

ఈ నవరాత్రులు ప్రతి సంవత్సరం 4 సార్లు రావడం జరుగుతుంది.

చైత్ర - ఆషాఢ - ఆశ్వయుజ - మాఘ మాసాలలో శుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు దేవీ నవరాత్రి వ్రతమును యథాశక్తిగా జరపాలి అని ఋషి ఉవాచ. ఈ నాలుగు మాసాలు నాలుగు ఋతువుల్లో రావడం జరుగుతుంది. ఆ సమయంలో ప్రకృతిలో సంభవించే

మార్పులు  మరియు ఆ కాల పరిస్థితులలో చోటుచేసుకొనే వాతావరణ మార్పుల వలన మరియు వసంత శరత్ కాలాలు రెండూ యముని కోరలవలె భయంకరములు. కాలం నుండి క్రిమి కీటకాల నుండి ప్రజలకు ఎటువంటి ఈతి బాధలు కలగకుండా... కాలాన్ని శాసించే

శక్తిగల ఆ జగన్మాతను వేడుకుంటూ తమని రక్షించి ఆదరించి అభివృద్ధి కలిగించమని కోరుతూ చేసేదే '' అసలైన దేవీ నవరాత్రి ఉత్సవ విధానం ''.

నవరాత్రి వ్రతం ఎందుకు చేయాలో దేవీ భాగవతంలో ఇలా చెప్పబడింది.

యత్రాస్తి భోగో నచ తత్ర మోక్షః ! యత్రాస్తి మోక్షః నచ తత్ర భోగః !!
శ్రీ సుందరీ సేవన తత్పరాణాం ! భోగశ్చ మోక్షశ్చ కరస్థయేన !!

మనకున్న దేవతలలో కొందరిని అర్చిస్తే భోగ భాగ్యములను అనుగ్రహిస్తారు కాని మోక్షమును ఇచ్చే శక్తి వారికి ఉండదు, కొందరిని అర్చిస్తే మోక్షమును అనుగ్రహిస్తారు కాని భోగ భాగ్యములను ఇచ్చే శక్తి ఉండదు. కానీ ......జగజ్జనని అయిన ఆ తల్లిని పూజిస్తే ఇహంలో భోగ భాగ్యములను, పరంలో ముక్తినీ ప్రసాదిస్తుంది అని అనుభవజ్ఞుల ఉవాచ.

విజయ దశమి కి ఉన్న ప్రాముఖ్యత :

★ త్రి శక్తి రూపిణి అయిన అమ్మవారు లోక కంటకుడు అయిన మహిషాసురునితో 9 రోజులు భీకర యుద్ధం చేసి ఈరోజే హతమార్చింది. ★

శ్రీరామచంద్రుడు రావాణాసురుణ్ణి చంపింది కూడా ఈరోజే.

★ శమీ వృక్షంపై ఉన్న అస్త్రాలను అర్జునుడు పూజించి ఉత్తర గో గ్రహణంలో కౌరవులపై గెలిచింది కూడా ఈరోజే.

★ భగీరథుడు గంగను భూలోకానికి తెచ్చినది కూడా ఈరోజే అంటారు.

## అసలు నవరాత్రులలో అమ్మవారిని ఎలా పూజించాలి.?

పాడ్యమి నుండి దశమి వరకు మనం అమ్మవారిని రోజుకో అలంకారంలో చూస్తూ ఉంటాము.ఒక ప్రాంతంలో ఉన్న అలంకారం మరో ప్రాంతంలో కనబడదు. దీనితో చాలామంది ఏ రోజు ఏ రూపాన్ని పూజించాలా ? అని సందిగ్ధతలో ఉంటారు.

నిజానికి ఇలా రోజుకో అలంకారం మనకు ఏ పురాణ గ్రంధాలలో చెప్పబడి ఉందో తెలీదు, కానీ రోజుకో దుర్గ అవతారాన్ని పూజించాలి అని మాత్రం ప్రమాణం చెప్పబడి ఉంది.

ప్రథమం శైలపుత్రీచ | ద్వితీయా బ్రహ్మచారిణీ |
తృతీయా చంద్రఘంటేతి | కూష్మాండేతి చతుర్థకీ |
పంచమా స్కందమాతేతి | షష్ఠా కాత్యాయనీతి చ |
సప్తమా కాలరాత్రే చ | అష్టమాచాతి భైరవీ |
నవమా సర్వసిద్ధిశ్చాత్ | నవదుర్గా ప్రకీర్తితా: ||

మొదటి రోజున శైలపుత్రిగా, 2 వ రోజు బ్రహ్మచారిణిగా, 3 వ రోజు చంద్రఘంటగా 4 వ రోజుకూష్మాండగా, 5 వ రోజు స్కందమాతగా, 6 వ రోజు కాత్యాయనిగా, 7 వ రోజు కాలరాత్రిగా, 8 వ రోజు భైరవిగా, 9 వ

రోజున సిద్ధిధాత్రిగా ఆవాహన చేసి పూజించాలి.

అయితే  చాలా చోట్ల అలంకారాలు ఒకే విధంగా ఉండడం లేవు.

ప్రమాణపరంగా అలంకారాలు ఆచరించడం కుదరకపోతే  ఈ 9

రోజుల్లో ఆ జగన్మాతని  త్రిశక్తి రూపిణిగా పూజించడం మంచిది.

అంటే ...!

మహిషాసురుడు తన మరణం స్త్రీ వల్ల కలగాలి అని వరం పొందాడు.

మహా బలసంపన్నుడు  అయిన వాణ్ని చంపడానికి ఒక్క స్త్రీకి బలం

సరిపోదు కావున

కాళి - లక్ష్మి- సరస్వతులు ముగ్గురు ఒక శక్తిరూపంగా ఆవిర్భవించి

మహిషాసుర మర్దిని అయ్యింది. కనుక ఈ నవరాత్రిలో మొదటి మూడు

రోజులు మహాకాళిగా మధ్య మూడు రోజులు మహాలక్ష్మిగా చివరి మూడు

రోజులు మహా సరస్వతిగా పూజించాలి. ఇది ఉత్తమమైన పద్ధతి అని నా

భావన.

శక్తికాముకులు  మహాకాళిని, ఐశ్వర్య కాముకులు మహాలక్ష్మిని, విద్యా

కాముకులు మహాసరస్వతిని ఆరాధించాలి. ( ఇది నా వ్యక్తిగత

అభిప్రాయమే. ఒక్కో చోట ఒక్కో విధంగా ఆచరిస్తూ అందరికీ తికమక

కలిగించడం కన్నా ఇదే మేలు )

## శ్రీ దేవీ నవరాత్రి పూజా విధానం : Devi Navaratri Puja Vidhanam

గణపతి ప్రార్థన: Ganesh Prardhana

శుక్లాంబరధరం విష్ణుం శశి వర్ణం చతుర్భుజం. !

ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే..!

ఆచమ్య: Achamanam is taking /sipping water 3 times

ఓం కేశవాయ స్వాహా. ( అని నీటిని తాగాలి )

ఓం నారాయణాయ స్వాహా. ( అని నీటిని తాగాలి )

ఓం మాధవాయ స్వాహా. ( అని నీటిని తాగాలి, పిదప ఆ ఎంగిలి చేతిని కడగాలి )

( నమస్కారము చేస్తూ ఈ క్రింది నామాలు చదవాలి)

ఓం గోవిందాయ నమః. ఓం విష్ణవే నమః. ఓం మధుసూదనాయ నమః.

ఓం త్రివిక్రమాయ నమః. ఓం వామనాయ నమః. ఓం శ్రీధరాయ నమః.

ఓం హృషీ కేశాయ నమః. ఓం పద్మ నాభయ నమః. ఓం దామోదరాయ నమః.

ఓం సంకర్షణాయ నమః. ఓం వాసుదేవాయ నమః. ఓం ప్రద్యుమ్నాయ నమః.

ఓం అనిరుద్ధాయ నమః. ఓం పురుషోత్తమాయ నమః. ఓం అధోక్షజాయ నమః.

ఓం నారసింహాయ నమః. ఓం అచ్యుతాయ నమః. ఓం జనార్దనాయనమః.

ఓం ఉపేంద్రాయ నమః. ఓం హరయే నమః. ఓం శ్రీ కృష్ణాయ నమః.

ఓం శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః .

యశ్శివో నామ రూపాభ్యాం యాదేవీ సర్వ మంగళా !
తయో సంస్మరణాత్పుంసాం సర్వతో జయ మంగళం. !!

తదేవ లగ్నం సుదినం తదేవ తారా బలం చంద్ర బలం తదేవ
విద్యా బలం దైవ బలం తదేవ లక్ష్మీ పతే తేంఘ్రియుగం స్మరామి.

సర్వదా సర్వ కార్యేషు నాస్తి తేషామ మంగళం
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః.

ఆపదామప హర్తారం దాతారం సర్వ సంపదాం
లోకాభిరామం శ్రీ రామం భూయో భూయో నమామ్యహం.

సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే.

శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః. ఉమా మహేశ్వరాభ్యాం నమః. వాణీ హిరణ్య గర్భాభ్యాం నమః. శచీ పురందరాభ్యాం నమః. అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః. శ్రీ సీతా రామాభ్యాం నమః. మాతా పితృభ్యో నమః. సర్వేభ్యో మహా జనేభ్యో నమః.

భూతోచ్చాటన :

( ఈ క్రింది మంత్రము చెప్పి ఆక్షితలను వాసన చూసి వెనుకకు వేయాలి. అందువల్ల మనము చేసే సత్కర్మలకు ఆటంకం కలిగించే భూతములు తొలగి పారిపోతాయి )

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యేతే భూమి భారకాః. !
యేతేషామవిరోధేన బ్రహ్మ కర్మ సమారభేత్. !!

ప్రాణా యామః : Pranayama

తరువాత ప్రాణా యామము చేయాలి.

ప్రాణాయామం అనగా కుడి చేయి ఉంగరంవేలు మరియు మధ్య వేలితో ముక్కు యొక్క ఎడమ రంధ్రమును మూసి, శ్వాసను ముక్కు కుడి రంధ్రం నుండి నెమ్మదిగా పీల్చుకోవాలి.( ఇలా పీల్చడమును పూరకము అని అంటారు ), అలా పీల్చిన గాలిని బయటకు వదలకుండా కుడిచేయి బొటనవేలితో ముక్కు కుడి రంధ్రమును కూడా మూసి ఆ శ్వాసను లోపల బంధించగలిగినంతసేపు బంధించాలి (ఇలా బంధించడమును కుంభకము అని అంటారు. ) ఆ తరువాత కుడి చేయి ఉంగరంవేలు మరియు మధ్య వేలిని తీసివేసి పీల్చుకున్న శ్వాసను మొత్తం ముక్కు కుడి రంధ్రం నుండి నెమ్మదిగా బయటకు వదలాలి ( ఇలా వదలడమును రేచకము అని అంటారు ).

ఈ ప్రాణాయామము చాలా శక్తి వంతమైనది. మన ఆయుః ప్రమాణం మన రెప్ప పాటులను బట్టి, ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలను బట్టి, మన నోటి

నుండి వచ్చే వర్ణ సంఖ్యను బట్టి నిర్ణయించ బడుతుంది. ఇన్ని సార్లు గాలి పీల్చి వదలిన పిమ్మట, ఇన్నిసార్లు రెప్పలు మూసి తెరచిన పిమ్మట, ఇన్ని అక్షరాలు పలికిన పిమ్మట వీడి ఆయువు తీరును అని విధిచేత రాయ బడి ఉంటుంది. మన ఆయువు తీరే నాటికి ఆ మూడూ ఒకేసారి పుర్తగును. అందుకే మన ఋషులు గాలిని పీల్చి కుంభకములోనే నిలిపి అనేక సంవత్సరములు రెప్పపాటు లేకుండా, మౌనంగా తపస్సు చేసే వారు. ఆ తపస్సు చేసినంతకాలం వారి ఆయుష్షు నిలచి ఉండేది. ఇంతటి శక్తి ఉంది ప్రాణాయామానికి. మనము అటువంటి తపస్సు చేయక పోయినా రోజూ కొంత సమయం ప్రాణాయామ సాధన చేస్తే ఎటువంటి రోగములనైనా అదుపులో పెట్టుకుని ఆ రోగ్యముతో జీవించ వచ్చును.

సంకల్పం:

(భారత దేశంలో ఉండే వారికి, ప్రధానంగా తెలుగు వారికి మాత్రమే ఈ సంకల్పం పనికి వస్తుంది.)

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం- శుభే శోభనే ముహూర్తే- శ్రీ మహా విష్ణో రాజయా- ప్రవర్తమానస్య- అద్య బ్రహ్మణః-ద్వితీయ పరార్ధే -స్వేతవరాహ కల్పే- వైవస్వత మన్వంతరే -కలియుగే-ప్రథమ పాదే-జంబూ ద్వీపే-భారత వర్షే -భరత ఖండే-మేరోర్దక్షిణ దిగ్భాగే-శ్రీశైలస్య.........ప్రదేశే

(హైదరాబాదు-వాయువ్య ప్రదేశం అవుతుంది. మీరు ఉన్న ప్రదేశాన్ని బట్టి ఇక్కడ మార్చి చెప్పుకోవాలి) - క్రిష్ణా గోదావర్యోర్మధ్యదేశే (ఇది కూడా ప్రదేశాన్ని బట్టి మారుతుంది)-శోభన గృహే-సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురు చరణ సన్నిధౌ- అస్మిన్ వర్తమానేన- వ్యావహారిక చాంద్రమానేన- (చాంద్ర మానం ప్రకారం) ( అమెరికాలో నివసించే వారైతే..  – క్రౌంచ ద్వీపే, రమణక వర్షే, ఐంద్రిక ఖండే, సప్త సముద్రాంతరే, కపిలారణ్యే అని చెప్పుకోవాలి )

స్వస్తిశ్రీ ...................... సంవత్సరే ( ప్రభవ, విభవ మొ..గు ౬0 సం. లలో ఇప్పుడు జరుగుతున్నది  ఏ సంవత్సరమైతే ఆ పేరు పెట్టాలి) .............. ఆయనే ( ఉత్తరాయణము లేదా దక్షిణాయనము )......... ఋతౌ ( ౬ ఋతువులు ) ......... మాసే ( చైత్రాది 12 మాసాలలో ఏదైతే అది.- )....పక్షే ( పక్షాలు రెండు. అవి 1. శుక్ల పక్షం, 2 కృష్ణ పక్షం-) ............ తిథౌ ( పాడ్యమ్యాదిగా 1౬ తిథులు -) ........ వాసరే ( 7 వారాలకి సంస్కృతంలో వేరే పేర్లు ఉన్నాయి అవి :

౧ . ఆదివారం - భానువాసరే. ౨. సోమవారం - ఇందువాసరే. 3. మంగళవారం - భౌమవాసరే. ౪ బుధవారం -సౌమ్యవాసరే. ౫ గురువారం - బృహస్పతి వాసరే. ౬ శుక్రవారం - భృగువాసరే. ౭ శనివారం - మందవాసరే అని అంటారు )

శుభ నక్షత్రే, శుభ యోగే శుభ కరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ తిథౌ-

శ్రీమాన్ .......... గోత్రః- .......... నామధేయః - ధర్మ పత్నీ సమేతోహం-
అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ
ఆయురారోగ్య ఐశ్వర్య అభివృద్ధి అర్ధం, ధర్మ అర్ధ కామ మోక్ష
చతుర్విధ ఫల పురుషార్ధ సిధ్యర్ధం, మమోపాత్త సమస్త దురితక్షయ
ద్వారా శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మాహాసరస్వతి దేవతా అనుగ్రహ ప్రసాద
సిధ్యర్ధం, శ్రీ దేవీ శరన్నవరాత్రి ఉత్సవం కర్తుం శ్రీ సూక్త పురుష సూక్త
విధానేన చతుశ్శష్టి ఉపచార పూజాం కరిష్యే ! అని సంకల్పించి
అక్షతలు నీళ్లు పళ్లెంలో వదిలి పెట్టాలి.

( టూకీగా ఈ సంకల్పం వివరణ: కలియుగం ప్రధమ పాదంలో-
భారతదేశంలో-హైదరాబాదులో- నాకు శుభమును కలిగించు
గృహములో- దేవుని ముందు ఉన్నటువంటి నేను- ఫలానా సంవత్సర-
మాస-తిథి-వార-నక్షత్ర ములు కలిగిన ఈ శుభ దినమున- ....గోత్రంలో
పుట్టిన-........ పేరుతో పిలవబడే నేను ----ధర్మ పత్నితో కూడుకున్న
వాడనైన( ఆడవారు ఇది చెప్పుకోనవసరం లేదు ) నేను, శ్రీ మహా
దేవిని ఉద్దేశించి- శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మాహాసరస్వతి దేవతా ప్రీతి
కొరకు-నాకు శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మాహాసరస్వతి దేవతా అనుగ్రహం
కలగడం కొరకు ఆ మహా దేవికి 64 రకాలైన సేవలతో కూడిన శ్రీ సూక్త
పురుష సూక్త విధాన చతుశ్శష్టి ఉపచార పూజను చేయుచున్నాను
అని అర్ధం.)

సంకల్పం అయిన పిదప కలశారాధన చెయ్యాలి.

తదంగ కలశారాధనం కరిష్యే. అని చెప్పి అక్షతలు నీరు వదలాలి.

కలశారాధనం !

కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య. !

రాగి ఇత్తడి లేదా వెండి చెంబులో శుద్ధమైన జలమును తీసుకొని ఆ జలమును పూజించాలి. మనము ఆచమనము చేసిన పాత్రను కాక, భగవంతునికి ఉపయోగించడం కొరకు వేరే ఒక కలశములో నీటిని తీసుకుని ఆ కలశమును గంధము,పసుపు,కుంకుమలతో అలంకరించాలి. కలశములో

త్రిమూర్తులు, మాతృగణములు, సప్తసాగరములు, సప్తద్వీపములు, చతుర్వేదములు ఆవాహన అగునట్లు భావిస్తూ ఈ క్రింది శ్లోకము చదవాలి. ( ఈ కలశము కేవలం భగవంతుని పూజకోసం వినియోగించడానికి మాత్రమే. మన ఆచమనముకోసం మనకో పాత్ర ఎలా ఉందో, అలాగే అమ్మవారి ఆచమనమునకు,స్నానమునకు మొదలైన వాని కొరకు నీటిని ఉపయోగించుటకు ఈ కలశం. )

కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృ గణాస్స్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేద: సామవేదోహ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః

ఆయాంతు దేవీ పూజార్థం దురితక్షయ కారకాః !
గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు.

ఓం ఆకలశేషు -- వర్ధతే !!
ఓం ఆపోవా ఇదగ్ం -- వస్సువరాప ఓం

(ఆ కలశములోని నీటి యందు గంగా మొదలైన సప్త నదులు ఆవాహన అయినట్లుగా భావించి ఈ క్రింది శ్లోకములను చదవాలి.)

కలశోదకేన పూజా ద్రవ్యాణి దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య.

కలశములోని నీటిని పూజా ద్రవ్యముల యందు, దేవుని యందు, తన యందు చల్లవలెను.

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా !
యస్మరేత్ పుండరీకాక్షం ! సబాహ్యః అభ్యంతరః శుచి: !!
గోవిందేతి సదా స్నానం గోవిందేతి సదా జపం !
గోవిందేతి సదా ధ్యానం సదా శ్రీ గోవింద కీర్తనం !!

కలశములో  ఏయే దేవతలు ఎక్కడ ఉంటారో ఈ కింది చిత్రములో చూడగలరు ...!






తదంగ శంఖ పూజాం కరిష్యే !

దక్షిణావర్త శంఖమును పూజించాలి.

శంఖం ప్రక్షాల్య ! ( శంఖమును కడగాలి )

శంఖం పూరయిత్వా ! (కలశం లోని నీటితో శంఖమును నింపాలి )

శంఖం గంధ పుష్ప అక్షతేన అభ్యర్చ్య ! ( గంధ అక్షతలతో పూజించాలి

శంఖమూలే బ్రహ్మణం ఆవాహయామి.

శంఖ మధ్యే విష్ణుం ఆవాహయామి.

శంఖ అగ్రే సదాశివం ఆవాహయామి.

అంటూ 3 సార్లు అక్షితలు వేయాలి.

ఆ శంఖమును ఎడమ చేతిలో పెట్టుకొని దానిపైన కుడి చేయిని పెట్టి

కింది శ్లోకం చెప్పాలి.

శంఖం చంద్రార్క దైవత్వం కుక్షౌ వారుణదైవతం !
పృష్టే ప్రజాపతిశ్చంద్ర అగ్రే గంగా సరస్వతీ !!
త్రైలోక్యే యాని తీర్థాని వాసుదేవస్యచాజ్ఞయా !
శంఖే తిష్ఠంతి సర్వాణి తస్మాత్ శంఖం ప్రపూజయేత్ !
త్వం పురా సాగరోత్పన్న: విష్ణునా విధ్రుతః కరే !
సర్వదేవ హితార్థాయ పాంచజన్య నమోస్తుతే !
దర్శనే నాపి శంఖస్య స్పర్శనేనతు సర్వత !
విలయం యాంతి పాపాని హిమవత్ భాస్కరోదయే !
స్తుత్వా శంఖం కరే ధ్రుత్వా మంత్రైరేభిస్తు వైష్ణవై: !

(ఈ శ్లోకం చదవడం రాకపోతే చదవకపోయినా ఫరవాలేదు. కింది మరో శ్లోకం చెప్పినా సరే..)

పాంచజన్యాయ విద్మహే పరమ పావనాయ ధీమహి !
తన్నః శంఖః ప్రచోదయాత్ !!

శంఖోదకేన పూజాద్రవ్యాని దేవం ఆత్మానం సంప్రోక్ష్య !

---

శంఖంలోని నీటి చేత పూజా వస్తువుల పైన దేవుని పైన తన పైన నీళ్ళు చల్లుకోవాలి. మళ్ళీ శంఖం నిండా నీటిని నింపాలి.

తదంగ ఘుంటా పూజాం కరిష్యే !

ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం
కుర్యాత్ ఘుంటారావం తత్ర దేవతాహ్వాన లాంచనం !
అపసర్పంతు యేభూతా: యేభూతా: భూమి భారకాః
యే భూతాః విఘ్న కర్తారః తేనష్యంతు శివజ్ఞాయా!
అపక్రామంతు భూతాద్యాః పిశాచాస్సర్వతో దిశాం
సర్వేశామవిరోదేనా బ్రహ్మకర్మ సమారభే !

ఈ శ్లోకం  చెప్పి ఘుంటా నాదం చేసి ఆ ఘుంటా పైన గంధం
అక్షింతలు వేసి నమస్కరించాలి.





## అథ గణపతి పూజాం కరిష్యే !

ముందుగా పసుపు గణపతిని సిద్ధం చేసుకొని పళ్ళెంలోని బియ్యంలో ఆ పసుపు గణపతిని ఉంచి పూజించాలి.

ధ్యానం :

గజాననం భూత గణాది సేవితం కపిత్థ జంబూ ఫలసార భక్షితం
ఉమాసుతం శోక వినాశ కారణం నమామి విఘ్నేశ్వర పాద పంకజం !

శ్రీ గణేశాయనమః ధ్యానం సమర్పయామి .

శ్రీ గణేశాయనమః ఆవాహనం సమర్పయామి

శ్రీ గణేశాయనమః పాద్యం సమర్పయామి

శ్రీ గణేశాయనమః అర్ఘ్యం సమర్పయామి

శ్రీ గణేశాయనమః ఆచమనం సమర్పయామి

శ్రీ గణేశాయనమః స్నానం సమర్పయామి

శ్రీ గణేశాయనమః వస్త్రం సమర్పయామి

శ్రీ గణేశాయనమః ఉపవీతం సమర్పయామి

శ్రీ గణేశాయనమః గంధం సమర్పయామి

శ్రీ గణేశాయనమః హరిద్ర చూర్ణం సమర్పయామి

శ్రీ గణేశాయనమః పుష్పం సమర్పయామి

శ్రీ గణేశాయనమః ధూపం సమర్పయామి

శ్రీ గణేశాయనమః  దీపం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  ఆచమనం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  నైవేద్యం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  శుద్ధ ఆచమనం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  తాంబూలం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  దక్షిణాం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  మంగళ నీరాజనం సమర్పయామి
శ్రీ గణేశాయనమః  మంత్రపుష్పం సమర్పయామి
శ్రీ గణేశాయనమః ప్రదక్షిణ నమస్కారం  సమర్పయామి

అనేన గణపతి పూజనేన పరమేశ్వర అర్పణం అస్తు ..అని అక్షితలు నీళ్ళు వదిలేయాలి.

ఇక్కడ గణపతి పూజని సూక్ష్మంగా నామాలతో ఇవ్వడం జరిగింది. ఇలా పూజించడం తప్పుకాదు. మీ అవకాశాన్ని బట్టి చేసుకోగలరు. విశేషంగా చేసుకునేట్లు అయితే గణపతి పూజ బుక్ ని కానీ లేదా మా పిడిఎఫ్ ని కానీ లేదా ఏదైనా పుస్తకమును కానీ  చూసి ఆచరించండి. ఎంత చేసాము అని కాదు. ఎంత భక్తి శ్రద్ధలతో చేసాము అన్నదే ప్రధానం కదా !

**అథ శ్రీ మహాదేవి పూజా** :

1.అథ ధ్యానం: Praying to Goddess

ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం
హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసద్ధేమ పద్మాం వరాంగీం
సర్వాలంకార యుక్తాం సతతమభయదాం భక్త నమ్రాం భవానీం
శ్రీవిద్యాం శాంతమూర్తిం సకల సురనుతాం సర్వ సంపత్ ప్రదాత్రీం

దశ వక్త్రా దశ భుజా దశ పాదాంజనప్రభా
విశాలయా రాజమాన త్రింశల్లోచన మాలయా !
స్ఫురద్దశన దంష్ట్రాసా భీమరూపాహి భూమిప
రూప సౌభాగ్య కాంతీనాం సా ప్రతిష్ఠా మహాశ్రయా !

ఖడ్గం బాణం గదాం శూలం శంఖం చక్రం భుశుండికం
పరిఘం కార్ముకం శీర్షం నిశ్చ్యోత ద్రుధిరందధౌ !
ఏషాసా వైష్ణవీ మాయా మహాకాళీ దురత్యయా
ఆరాధితా వశీకుర్యాత్ పూజా కర్తుశ్చరాచారం !! 1

సర్వదేవ శరీరేభ్యో యావిర్భూతామితప్రభా !
త్రిగుణాసా మహాలక్ష్మీ: సాక్షాన్మహిష మర్దినీ !!
శ్వేతాననా నీలభుజా సుశ్వేతస్తన మండలా !

రక్త మధ్యా రక్త పాదా రక్త జంఘోరురున్నతా !!
సుచిత్ర జఘునా చిత్రమాల్యంబర విభూషణా !
చిత్రానులేపనా కాంతి రూప సౌభాగ్య శాలినీ !!
అష్టాదశ భుజా పూజ్యా సా  సహస్ర భుజాసతీ !
ఆయుధాన్యత్ర వక్ష్యంతే దక్షినాధః కరక్రమాత్ !!

అక్షమాలాచ కమలం బాణోసి: కులిశం గదా !
చక్రం త్రిశూలం పరశుశ్శంఖో ఘంటాచ పాశకః !!
శక్తిర్దండః చర్మ చాపః పాన పాత్రం కమండలు: !
అలంకృత భుజామేభిరాయుధై: కమలాసనాం  !!
సర్వదేవమయీ మీశాం మాహాలక్ష్మిమిమాం నృప !
పూజయేత్ సర్వ లోకానాం సదేవానాం ప్రభుర్భవేత్ !!   2

గౌరీ దేహాత్సముద్భూతా యా సత్వైక గుణాశ్రయా !
సాక్షాత్సరస్వతీ ప్రోక్తా శుంభాసుర నిబర్హిణీ !!
దధౌ చాష్ట భుజా బాణ ముసలే శూలచక్రభృత్ !
శంఖం ఘంటాం లాంగలంచ కార్ముకం వసుధాధిప !!
ఏషా సంపూజితా భక్త్యా సర్వజ్ఞత్వం ప్రయచ్ఛతి !
నిశుంభమధనీ దేవీ శుంభాసుర నిబర్హిణీ !!

వందేహం కుంద సునాభాం ఇందీవర దళేక్షనాం !
వందారు జనమందారం వల్లీం వాగధి దేవతాం !!
ఉషసి మాగధ మంగళ గాయనై: ఝుడితి జాగృహి జాగృహి !
అతి కృపార్ద్ర కటాక్ష నిరీక్షనై: జగదిదం జగదంబ సుఖీకురు !!

మనసులో అమ్మవారి రూపాన్ని ధ్యానించాలి ( భావన చేయాలి ).
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహలక్ష్మి మహాసరస్వత్యై నమః ధ్యానం సమర్పయామి ! 3

కనక కలశ శోభమాన శీర్షం జలధరచుంబి సముల్ల సత్పతాకం !
భగవతి తవ సన్నివాసహేతోర్మణి మయ మందిరమేతదర్పయామి !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహలక్ష్మి మహాసరస్వత్యై నమః దివ్య మందిరం సమర్పయామి ! 4

( అమ్మా నేను నిన్ను పూజించ తలచి నీ కోసం ప్రత్యేకంగా మందిరం ఏర్పాటు చేసినాను , ఇది స్వీకరించి మమ్ము అనుగ్రహించు అని భావన చేసి అక్షతలు కలశము లేదా విగ్రహముపై వేయవలెను. ఇక్కడ కలశము అంటే ప్రధాన కలశం. అంటే సత్యనారాయణ వ్రతంలో వలే దేవుని పటము ముందు కలశము పెట్టి, దానిపై కొబ్బరికాయను ఉంచి, దానిమీద వస్త్రమును ఉంచుతారు. అలాగే . )

కనకమయ వితర్ది శోభమానం దిశి దిశి పూర్ణ సువర్ణ కుంభయుక్తం !
మయి కృపయాశు సమర్చనం గృహీతం మణిమయ మండప
మధ్యమేహి మాతః !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః రత్న
మండపం సమర్పయామి. 5
అమ్మా మందిరంలో రత్నములతో పోదుగబడిన మండపం
అలంకరించాను, ఇది గ్రహించి అనుగ్రహించు

తపనీయ్యమయీ సతూలికా కమనీయా మృదులోత్తరచ్ఛదా !
నవరత్న విభూశితా మయా శిబికేయం జగదంబితేర్పితే !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఆందోళికాం సమర్పయామి. 6
( అమ్మా... హంస తూలికములతో అలంకరింపబడ్డ ఈ మేనా సమర్పిస్తున్నాను
నీవు వచ్చి నా పూజను స్వీకరించి నన్ను అనుగ్రహించ వలసినది. అని భావన )

శంఖ చక్ర గదా హస్తే సువర్ణాభే సుశోభనే !
మమదేవి వరం దేహి సర్వసిద్ధి ప్రదాయిని !!
ఓం సహస్ర శీర్షా -- దశాంగులం !
ఓం హిరణ్య వర్ణాం -- మమావాహ !

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఆవాహనం సమర్పయామి. 7
( అమ్మా నేను నిన్ను పూజించ తలచి మా గృహమునకు ఆహ్వానిస్తున్నాను. నీవు వచ్చి నా పూజను స్వీకరించి నన్ను అనుగ్రహించ వలసినది. అని భావన చేసి అక్షతలు వేయాలి )

నానావరప్రదాం దేవీం సమారాధన సువ్రతాం !
పీతాంబర ధరాం దేవీం సర్వక్షోభ వివర్జితాం !
కనకమయ వితర్ది స్థాపితే తూలికాఢ్యే
వివిధ కుసుమ కీర్ణే కోటి బాలార్క వర్ణే !
భగవతి రమణీయే రత్న సింహాసనేస్మిన్
ఉపవిష పదయుగ్మం హేమ పీఠే నిధాయ !!
ఓం పురుష ఏ వేదగ్ం -- తిరోహతి !
ఓం తాం మ ఆవాహ -- పురుషానహం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః రత్న సింహాసనం సమర్పయామి. 8
( అమ్మా! నీవు ఈ ఆసనమును అలంకరించ వలసినది అని భావించి అమ్మవారిని ఉంచిన ఆసనముపై ) అక్షతలు వేయాలి

మణిమౌక్తిక నిర్మితం మహాంతం కనకస్తంభ చతుష్టయేన యుక్తం !
కమనీయ తమం భవాని తుభ్యం నవముల్లాభమిదం సమర్పయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
వితానం సమర్పయామి. 9 (4 కాళ్ళ తోరణ పీటము )

( అమ్మా! నీవు ఈ ఆసనమును అలంకరించ వలసినది అని భావించి అమ్మవారిని ఉంచిన ఆసనముపై ) అక్షతలు వేయవలెను.

తప్త కాంచన సంకాశాం కమలాం కమలాలయాం !
కన్యామింద్రాది పూజ్యాం తాం జగదంబాం నమామ్యహం !!
దూర్వయా సరసిజాన్విత విష్ణుక్రాంత యాచ సహితం కుసుమాఢ్యం !
పద్మయుగ్మ సద్రుశే పదయుగ్మే పాద్యమేత దురరీకురు మాతః !!
ఓం ఏతావానస్య --- మృతందివి !!
ఓం అశ్వపూర్వాం --- జుషతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహాలక్ష్మి మహాసరస్వత్యై నమః పాద్యం సమర్పయామి. 10
అమ్మా! నీ పాదముల కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి) కలశము లోని (ఆచమనం చేసిన పాత్రకాక మరొక పాత్రకు అలంకారం చేశారు కదా అందులోని ) నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదలవలెను.

జగద్వంద్యాం మహాలక్ష్మీం ప్రకృతిం విష్ణువల్లభాం !
రత్న సింహాసనస్థాంచ వందితాం పరమేశ్వరీం !!
గంధ పుష్ప యవ సర్షప దూర్వా సంయుతం తిల కుశాక్షత మిశ్రం !
హేమపాత్ర నిహితం సహరత్నై: అర్ఘ్యమేత దురరీకురు మాతః !!

ఓం త్రిపాదూర్ధ్వ --- నశనే అభి !
ఓం కాంసోస్మితాం --- హ్వయే శ్రియం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మాహలక్ష్మి మహాసరస్వత్యై నమః అర్ఘ్యం సమర్పయామి. 11.
( అమ్మా! నీ హస్తముల కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి) కలశము లోని నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదల వలెను.

విద్యాధరాం మహాదేవీం పద్మాక్షీం లోకమాతరం !
సర్వైశ్వర్య ప్రదామాచమన దానేన పూజయేత్ !!
జలజద్యుతినా కరేణ జాతీ ఫల తక్కోల లవంగ గంధ యుక్తై: !
అమలైరమృతరివాతి శీతై: భగవత్యాచమనం విధీయతాం !!
ఓం తస్మాద్విరాడ -- మదోపురః !!
ఓం చంద్రాం ప్రభాసాం -- త్వాం వృణే !! 12
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః ముఖే శుద్ధ ఆచమనం సమర్పయామి.
( అమ్మా! నీ ఆచమనము కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి) కలశము లోని నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదల వలెను.

పంచామృతాదంతరేవ మంత్రైర్వేదోక్త కైరపి !
మధ్యే మధ్యే పూజయామి మధుపర్క పురస్సరం !!
నిహితం కనకస్య సంపుటే పిహితం రత్న పిధాన కేనయత్ !
తదితం భవతీ కరేర్పితం మధుపర్కం జనని ప్రతిగృహ్యతాం !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
మధుపర్కం సమర్పయామి. 13.

( అమ్మా! ఈ చల్లని మధుపర్కమును స్వీకరించు అని భావించి )
పెరుగు,బెల్లం/పంచదార కలిపి అమ్మవారికి చూపి పళ్లెములో వదలవలెను. ( దూరమునుండి వచ్చిన అతిథికి, ప్రయాణ బడలిక,వేడి తగ్గడం కోసం మజ్జిగ ఇవ్వడం వంటిది ఈ మధుపర్కం ఇవ్వడం )

ఏతచ్చంపక తైలమంబ వివిధై: పుష్పైర్ ముహుర్వాసితం !
న్యస్తం రత్నమయే సువర్ణ చషకే భృంగైర్ భ్రమద్భిర్వృతం !!
సానందం సురసుందరీభిరభితో హస్తైర్ ధృతంతే మయా !
కేశేషు భ్రమర ప్రభేషు సకలేష్వంగేషుచా లిప్యతే !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
అభ్యంగనం సమర్పయామి. 14

అమ్మా....నీ కురులకు అలంకరించేందుకై బంగారు గిన్నెలో సంపంగి నూనెను తెచ్చాను గ్రహించు .

.

మాతః కుంకుమ పంక నిర్మితమిదం దేహే తవోద్వర్తనం !
భక్త్యాహం కలయామి హేమరజసా సంమిశ్రితః కేసరై: !!
కేశానామలకైర్విశోధ్య విమలై: కస్తూరికాద్యన్వితై: !
స్నానంతే నవరత్న కుంభ నిహితై: సంవాసితోష్ణోదకై: !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఉద్వర్తనం సమర్పయామి. **15.**

అమ్మా ... నీవు స్నానం చేసేందుకు ఉష్ణోదకం ( వేడినీళ్ళు ) తెచ్చాను. ఈ నీళ్ళలో కుంకుమపువ్వు పొగడ పువ్వుల చూర్ణం వేసాను. నలుగుపిండితో ఈ నీళ్ళను గ్రహించు .

దధి దుగ్ధ ఘృతైస్సమాక్షికై స్సితయా శర్కరయా సమన్వితై: !
స్నాపయామి తవాంగ మాదృతో జననిత్వాం పునరుష్ణ వారిభి: !! 16

గో క్షీర స్నానం - ఆవు పాలు

ఓం ఆప్యాయ.... సంగధే !

కామధేనో సముద్భూతం తేజో కాంతి వివర్ధనం !
బలవీర్య సముత్పన్నం క్షీరం పుష్టికరం శుభం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
నమః గో క్షీర స్నానం సమర్పయామి.

గో దధి స్నానం - ఆవు పెరుగు !

ఓం దధిక్రావన్ణో - శితాలిషత్ !

గవాక్షీర సమూద్భూతం వీర్య వృద్ధిశ్చ కారణం !
శరశ్చంద్ర నిభం శ్రేష్టం దధిరారోగ్య వర్ధనం !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః

గో దధి స్నానం సమర్పయామి.

గో ఘృత స్నానం - ఆవు నేయి !

ఓం శుక్రమసి - రశ్మిభి: !

దధి గర్భ సముద్భూతం సర్వ యజ్ఞ వివర్ధనం !

అగ్ని ప్రీతికరం శ్రేష్ఠం దేవతాహార ముత్తమం !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః

గో ఆజ్య స్నానం సమర్పయామి.

మధు స్నానం - తేనె !

ఓం మధువాతా - భవంతునః !!

పుష్ప స్వాదు రసోద్భూతం జీవానాం పుష్టికారణం !

ఓషధీ సహ గామిన్యాం పృథివ్యాం అమృతం మధుం !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః

మధు స్నానం సమర్పయామి.

ఇక్షు రసం - చెరుకు !

ఓం స్వాదు: పవస్వ - అదాభ్యః !

పర్వతైశ్చ సముద్భూతం సర్వలోక ప్రియావహం !
పంచానామమృతం శ్రేష్ఠం ఇక్షురస ప్రియదర్శిని !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఇక్షు రస స్నానం సమర్పయామి. పంచామృతస్నానం సమర్పయామి.

ఫలోదక స్నానం ( కొబ్బరినీళ్ళు పళ్ళరసాలు ) !! ( Bathing with Fruit Juices ) ఓం యాః ఫలినీర్యా - త్వగ్ం హసః !
నారికేళ సముద్భూతం వియత్తోయం ఫలైర్యుతం !
దేవానామభిషేకార్థం ఫలోదకం శుభావహం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఫలోదక స్నానం సమర్పయామి.

శుద్ధోదకస్నానము !!
నదీనాంచైవ సర్వాసాం మయానీతం జలం శుభం !
అనేన స్నానయామ్యంబ మంత్రైర్వారుణ సంభవై: !!
ఏలోశీర సువాసితైస్సుకుసుమైర్ గంగాది తీర్థోదకై: !
మాణిక్యామల మౌక్తికాదియుతైస్స్వచ్ఛైస్సు వర్ణోదకై: !!
మంత్రాన్ వైదిక తాంత్రికాన్ పఠి పఠన్ సానంద మత్యాదరాత్ !
స్నానంతే పరికల్పయామి జననిస్నానం త్వ మంగీకురు !!
ఓం యత్పురు --- శరద్ధవి: !

ఓం ఆదిత్యవర్ణే --- బాహ్యాలక్ష్మీః !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః

శుద్ధోదక స్నానం సమర్పయామి. 17 ( ఇక్కడ అభిషేకంలో విశేష పదార్థాలతో రుద్రము పంచ సూక్తాలు, దేవీ సూక్తము, ఇతర విశేష అభిషేక మంత్రాలు మీ సమయాన్ని బట్టి చెప్పుకోవాలి . రానివారు చెప్పొద్దు )

జగద్వంద్యాం మహాలక్ష్మీం ప్రకృతిం విష్ణువల్లభాం !

నానావిధై: శుభైర్ వస్త్రై: పూజయామీశ వల్లభాం !!

బాలార్కద్యుతి దాడిమీయ కుసుమం ప్రస్పర్ధి సర్వోత్తమం !

మాతస్త్వం పరిధేహి దివ్యవసనం భక్త్యా మయా కల్పితం !

ముక్తాభిర్ గ్రథితం సకంచుకమిదం స్వీకృత్య పీతప్రభం !!

తప్త స్వర్ణ సమాన వర్ణ మతులం ప్రావర్ణమంగీకురు !!

ఓం సప్తాస్యాసన్ --- పురుషం పశుం !!

ఓం ఉపైతుమాం --- దదాతుమే !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః ప్రావరణ పరిధాన వస్త్రం సమర్పయామి 18.

( అమ్మా! నీ అలంకరణ కోసం బాల సూర్యుని వలె ప్రకాశించే లేత రంగు వస్త్రమును స్వీకరించు అని భావించి ) వస్త్రమును గానీ, ప్రత్తితో చేసిన వస్త్రమును గానీ సమర్పించాలి.

సర్వసిద్ధి ప్రదాం దేవీం సర్వలోక మహేశ్వరీం !
నానారత్న ధరాంవందే నానాగుణ విధాయినీం !!
ఓం తం యజ్ఞం బర్హి --- ఋశయశ్చయే !!
ఓం క్షుత్పి పాసా --- మే గృహాత్ !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః ఉపవీతం సమర్పయామి. 19.

నవరత్న యుతే మయార్పితే కమనీయే తపనీయ పాదుకే !
సవిలాసమిదం పదద్వయం కృపయాదేవి తయోర్నిధీయతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః దివ్య పాదుకే సమర్పయామి. ( అమ్మవారి కాళ్ళకు పాదరక్షలు ) 21.
అమ్మా కోమలమైన నీ పాదాలకు అందమైన పాదుకలు సమర్పిస్తున్నాను గ్రహించు అని పాదుకలు లేదా అక్షితలు సమర్పించాలి.

బహుభిర గురుధూపై: సాదరం ధూపయిత్వా !
భగవతి తవకేశాన్ కంకతైర్ మార్జయిత్వా !!
సురభిభిరరవిందైశ్ చంపకైశ్చార్చయిత్వా !
ఝుడితి కనక సూత్రైర్ జూటమన్వేష్టయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః కేశ పాశ బంధనం సమర్పయామి. (అమ్మా...వివిధ రకాల ధూపములతో నీ కురులకు

ధూపం వేసాను, కురులు అలంకరించడానికి సంపెంగలు తెచ్చాను గ్రహించు అని అమ్మవారి కురులకు సాంబ్రాణి వేసి జట్టు ముడి వేస్తున్నట్లుగా భావన చేయాలి ).

సౌవీరాంజనమిదమంబ చక్షుషోస్తే విన్యస్తం కనక శలాకయా మయాయత్ !
తన్మానం మలిన మపిత్వ దక్షి సంగాత్ బ్రహ్మేంద్రాది అభిలషణీయ తామియాయ !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః నేత్రయో: సౌవీరాంజనం సమర్పయామి.

( అమ్మవారి కళ్ళకు బంగారు పుల్లతో కాటుక పెట్టినట్లు భావించాలి. కాటుకను ఒక పుష్పానికి అద్ది అమ్మవారిపైన వేయాలి ) 22.

మాణిక్య ముక్తాఫల విద్రుమైశ్చ గారుత్మతైశ్చాప్యథ పుష్యరాగై: !
వజ్రంచ నీలంచ గృహాణదేవీ గోమేధి వైడూర్య కృతాంశ్చ హారాన్ !!
మంజీరే పదయోర్నిధాయ రుచిరౌ విన్యస్య కాంచీం కటౌ !
ముక్తాహార మురోజ యోరనుపాం నక్షత్రమాలాం గళే !
కేయూరాణి భుజేషు రత్న వలయ శ్రేణీ కరేషు క్రమాత్ !
తాటంకే తవకర్ణయోర్వినిదధే శీర్షే చ చూడామణిం !

ధమ్మిల్లే తవదేవి హేమకుసుమాన్యాధాయ ఫాలస్థలే !
ముక్తారాజి విరాజి హేమతిలకం నాసాపుటే మౌక్తికం !!
మాతర్మౌక్తిక జాలికాంచ కుచయోస్సర్వాంళీషూర్మికాః !
కట్యాం కాంచన కింకిణీర్వినిదధే రత్నావతం సంశ్రుతౌ !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
సర్వావిధ ఆభరణాని సమర్పయామి. **23**.
ఇక్కడ అమ్మవారికి అన్ని రకాల ఆభరణాలు అలంకరించాలి.

చందనాగరు కర్పూర గోరోచన సుకుంకుమం !
కస్తుర్యాది సుగంధాఢ్యం సర్వాంగేషు విలేపయే !!
మాతః ఫాలతలే తవాతి విమలే కాశ్మీర కస్తూరికా !
కర్పూరాభి: కరోమి తిలకం దేహేంగ రాగం తవ !!
వక్షోజాదిషు యక్షకర్ద మరసై: సిక్త్వాచ పుష్ప ద్రవై: !
పాదౌచందన లేపనాది భిరహం సంపూజయామి క్రమాత్ !!
ఓం తస్మాత్ యజ్ఞాత్ --- సంభృతం --- గ్రామ్యాశ్చయే !!
ఓం గంధ ద్వారం -- శ్రియం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
దివ్య శ్రీ గంధం సమర్పయామి. **24.**

శ్వేత వర్ణాన మలభాన్ కుంకుమాక్తాంశ్చ తండులాన్ !
అక్షతాన్ అర్పయిష్యామి లలాట ఫలకే శుచౌ !!
రత్నాక్షతైస్త్వాం పరిపూజయామి ముక్తాఫలైర్వారుచిరైరవిద్ధైః !
అఖండితైర్దేవి యవాదిభిర్వా కాశ్మీర పంకాంకిత తండులైర్వా !!
ఓం తస్మాద్యజ్ఞాత్ --- ఋచస్సామాని -----దజాయత !
ఓం శ్రీర్మే భజతు ----- మేనష్యతు !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
రత్నాక్షతాన్ సమర్పయామి. **25**.

హరస్యార్ధ శరీరాంగి హంస రూపి యతీశ్వరి !
హస్త ముద్రాంకుశధరే దేవి హరిద్రాం మాతృకర్పయే !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
హరిద్రా చూర్ణం సమర్పయామి. 26.

కైలాసవాసినీ దేవీ కస్తూరి తిలకాధరే !
కాళినీ గిరిజాదేవీ కుంకుమాన్ మాతృకర్పయే !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః కుంకుమ విలేపనం సమర్పయామి. 27.

---

మం. ఓం ఆయనేతే....ఇమే !
మం. ఓం ఆహిరివ....విశ్వతః !

జనని చంపక తైలమిదం పురోమృగమదోపయుతం పటవాసకం !
సురభి గంధయుతం చతుర్భుజేసపది సర్వమిదం ప్రతిగృహ్యతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః నానావిధ సుగంధ పరిమళ ద్రవ్యాణి సమర్పయామి. 28.
( ఇక్కడ అమ్మవారికి సెంటు అత్తరు పన్నీరు మొ.న సుగంధ ద్రవ్యాలు చల్లాలి.)

సీమంతేతే భగవతి మయాసాదరన్యస్తమేతః !
సింధూరంమే హృదయ కమలే హర్షవర్షంతనోతు !!
బాలాదిత్యద్యుతిరివ సదా లోహితాయస్య కాంతి !
స్వాంతర్ధ్వాంతం హరతు సకలం చేతసా చింతయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః సీమంతే సింధూరం సమర్పయామి. 29
( ఇక్కడ అమ్మవారికి పాపిటలో సింధూరం అలంకరించాలి )
మందార పారిజాతాబ్జ కేతకీ పాటలీ సుమై: !
మాలతీ మల్లికా పుష్పైస్సర్వ పుష్పైశ్చ పూజయే !!
మందారకుంద కరవీర పుష్పైస్త్వాందేవి సంతతమహం పరిపూజయామి !
జాతీజపావకుల చంపక కేతకాది నానావిధాని కుసుమానిచ తేర్పయామి

మాలతీవకుళ హేమపుష్పికా కాంచనారు కరవీర కేతకై: !
కర్ణికారగిరి కర్ణికాదిభి: పూజయామి జగదంబతే వపు: !!
పారిజాత శతపత్ర పాటలైర్ మల్లికా వకుళ చంపకాదిభి: !
అంబుజైర్ వికసితైశ్చ సాదరం పూజయామి జగదంబతే వపు: !!
ఓం తస్మాదశ్వా --- అజావయః !
ఓం మనసః --- యశః !
ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళి మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః సుగంధ పుష్పాణి సమర్పయామి. 30.

## !! అధాంగ పూజ !!

ఓం ఐం హ్రీం శ్రీం మహాకాళ్యై నమః - పాదౌ పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం వారాహ్యై నమః - జానునీ పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం జ్యోత్స్నాయై నమః - ఊరూంపూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం బ్రహ్మణ్యై నమః - కటిం పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం బ్రాహ్మ్యై నమః - నాభిం పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం వైష్ణవ్యై నమః - స్థనౌ పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం కంభుకంఠ్యై నమః - కంఠం పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం సుముఖాయై నమః - ముఖం పూజయామి
ఓం ఐం హ్రీం శ్రీం సునేత్రాయై నమః - నేత్రౌ పూజయామి

ఓం ఐం హ్రీం శ్రీం రమాయై నమః - కర్ణౌ పూజయామి

ఓం ఐం హ్రీం శ్రీం కమలాయై నమః - శిరః పూజయామి

ఓం ఐం హ్రీం శ్రీం సర్వ దేవ స్తుతాయై నమః సర్వాణ్యంగాని పూజయామి

(ఇక్కడ సమయానుకూలంగా లలితా సహస్రనామాలు, అష్టోత్తరం, ఖడ్గమాలా, మో.వి చెప్పుకోవచ్చు.)

ఓం అస్య శ్రీ లలితా దివ్య సహస్రనామ స్తోత్ర మహామన్త్రస్య, వశిన్యాది వాగ్దేవతా ఋషయః, అనుష్టుప్ ఛన్దః, శ్రీ లలితా పరాభట్టారికా మహా త్రిపుర సున్దరీ దేవతా, ఐం బీజం, క్లీం శక్తిః, సౌః కీలకం, మమ ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థే లలితా త్రిపురసున్దరీ పరాభట్టారికా సహస్ర నామ జపే వినియోగః

కరన్యాసః

ఐమ్ అఙ్గుష్ఠాభ్యాం నమః, క్లీం తర్జనీభ్యాం నమః, సౌః మధ్యమాభ్యాం నమః, సౌః అనామికాభ్యాం నమః, క్లీం కనిష్ఠికాభ్యాం నమః, ఐం కరతల కరపృష్ఠాభ్యాం నమః

అఙ్గన్యాసః

ఐం హృదయాయ నమః, క్లీం శిరసే స్వాహా, సౌః శిఖాయై వషట్, సౌః కవచ్ఛాయ హుం, క్లీం నేత్రత్రయాయ వౌషట్, ఐమ్ అస్త్రాయఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః

ధ్యానం

అరుణాం కరుణా తరఙ్గితాక్షీం ధృతపాశాఙ్కుశ పుష్పబాణచాపామ్ |

అణిమాదిభి రావృతాం మయూఖైః అహమిత్యేవ విభావయే భవానీమ్ ||

ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మ పత్రాయతాక్షీం

హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసమద్ధేమపద్మాం వరాఙ్గీమ్ |

సర్వాలఙ్కారయుక్తాం సకలమభయదాం భక్తనమ్రాం భవానీం

శ్రీ విద్యాం శాన్తమూర్తిం సకల సురసుతాం సర్వసమ్పత్-ప్రదాత్రీమ్ || ౧ ||

సకుఙ్కుమ విలేపనా మళికచుమ్బి కస్తూరికాం

సమన్ద హసితేక్షణాం సశరచాప పాశాఙ్కుశామ్ |

అశేష జనమోహినీ మరుణమాల్య భూషోజ్జ్వలాం

జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరే దమ్బికామ్ ‖ ౩ ‖

సిన్ధూరారుణ విగ్రహాం త్రిణయనాం మాణిక్య మౌళిస్ఫుర-

త్తారానాయక శేఖరాం స్మితముఖీ మాపీన వక్షోరుహామ్ |

పాణిభ్యా మలిపూర్ణ రత్న చషకం రక్తోత్పలం బిభ్రతీం

సౌమ్యాం రత్నఘటస్థ రక్త చరణాం ధ్యాయేత్పరామమ్బికామ్ ‖ ౪ ‖

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

శ్రీ మాతా, శ్రీ మహారాజ్ఞీ, శ్రీమత్-సింహాసనేశ్వరీ |

చిదగ్ని కుణ్డసమ్భూతా, దేవకార్యసముద్యతా ‖ ౧ ‖

ఉద్యద్భాను సహస్రాభా, చతుర్బాహు సమన్వితా |

రాగస్వరూప పాశాఢ్యా, క్రోధాకారాఙ్కుశోజ్జ్వలా ‖ ౨ ‖

మనోరూపేక్షుకోదణ్డా, పఞ్చతన్మాత్ర సాయకా |

నిజారుణ ప్రభాపూర మజ్జద్-బ్రహ్మాణ్డమణ్డలా ‖ ౩ ‖

చమ్పకాశోక పున్నాగ సౌగన్ధిక లసత్కచా

కురువిన్ద మణిశ్రేణీ కనత్కోటీర మణ్డితా || ౪ ||

అష్టమీ చన్ద్ర విభ్రాజ దళికస్థల శోభితా |

ముఖచన్ద్ర కళఙ్కాభ మృగనాభి విశేషకా || ౫ ||

వదనస్మర మాఙ్గల్య గృహతోరణ చిల్లికా |

వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభ లోచనా || ౬ ||

నవచమ్పక పుష్పాభ నాసాదణ్డ విరాజితా |

తారాకాన్తి తిరస్కారి నాసాభరణ భాసురా || ౭ ||

కదమ్బ మఞ్జరీక్లృప్త కర్ణపూర మనోహరా |

తాటఙ్క యుగళీభూత తపనోడుప మణ్డలా || ౮ ||

పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః |

నవవిద్రుమ బిమ్బశ్రీః న్యక్కారి రదనచ్ఛదా || ౯ ||

శుద్ధ విద్యాఙ్కురాకార ద్విజపఙ్క్తి ద్వయోజ్జ్వలా |

కర్పూరవీటి కామోద సమాకర్ష ద్దిగన్తరా || ౧౦ ||

నిజసల్లాప మాధుర్య వినిర్భర్-త్సిత కచ్ఛపీ |

మన్దస్మిత ప్రభాపూర మజ్జత్-కామేశ మానసా || ౧౧ ||

అనాకలిత సాదృశ్య చుబుక శ్రీ విరాజితా |

కామేశబద్ధ మాఙ్గల్య సూత్రశోభిత కన్ధరా || ౧౨ ||

కనకాఙ్గద కేయూర కమనీయ భుజాన్వితా |

రత్నగ్రైవేయ చిన్తాక లోలముక్తా ఫలాన్వితా || ౧౩ ||

కామేశ్వర ప్రేమరత్న మణి ప్రతిపణస్తనీ|

నాభ్యాలవాల రోమాళి లతాఫల కుచద్వయీ || ౧౪ ||

లక్ష్యరోమలతా ధారతా సమున్నేయ మధ్యమా |

స్తనభార దళన్-మధ్య పట్టబన్ధ వళిత్రయా || ౧౫ ||

అరుణారుణ కౌసుమ్భ వస్త్ర భాస్వత్-కటీతటీ |

రత్నకిఙ్కిణి కారమ్య రశనాదామ భూషితా || ౧౬ ||

కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా |

మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితా || ౧౭ ||

ఇన్ద్రగోప పరిక్షిప్త స్మర తూణాభ జఙ్ఘికా |

గూఢగుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా ॥ ౧౮ ॥

నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా ।

పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా ॥ ౧౯ ॥

శిఞ్జాన మణిమఞ్జీర మణ్డిత శ్రీ పదామ్బుజా ।

మరాళీ మన్దగమనా, మహాలావణ్య శేవధిః ॥ ౨౦ ॥

సర్వారుణాఽనవద్యాఙ్గీ సర్వాభరణ భూషితా ।

శివకామేశ్వరాఙ్కస్థా, శివా, స్వాధీన వల్లభా ॥ ౨౧ ॥

సుమేరు మధ్యశృఙ్గస్థా, శ్రీమన్నగర నాయికా ।

చిన్తామణి గృహాన్తస్థా, పఞ్చబ్రహ్మాసనస్థితా ॥ ౨౨ ॥

మహాపద్మాటవీ సంస్థా, కదమ్బ వనవాసినీ ।

సుధాసాగర మధ్యస్థా, కామాక్షీ కామదాయినీ ॥ ౨౩ ॥

దేవర్షి గణసఙ్ఘాత స్తూయమానాత్మ వైభవా ।

భణ్డాసుర వధోద్యుక్త శక్తిసేనా సమన్వితా ॥ ౨౪ ॥

సమ్పత్కరీ సమారూఢ సిన్ధుర వ్రజసేవితా ।

అశ్వారూఢాధిష్ఠితాశ్వ కోటికోటి భిరావృతా ‖ ౨౫ ‖

చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా |

గేయచక్ర రథారూఢ మన్త్రిణీ పరిసేవితా ‖ ౨౬ ‖

కిరిచక్ర రథారూఢ దణ్డనాథా పురస్కృతా |

జ్వాలామాలిని కాక్షిప్త వహ్నిప్రాకార మధ్యగా ‖ ౨౭ ‖

భణ్డసైన్య వధోద్యుక్త శక్తి విక్రమహర్షితా |

నిత్యా పరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా ‖ ౨౮ ‖

భణ్డపుత్ర వధోద్యుక్త బాలావిక్రమ నన్దితా |

మన్త్రిణ్యమ్బా విరచిత విషఙ్గ వధతోషితా ‖ ౨౯ ‖

విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్యనన్దితా |

కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా ‖ ౩౦ ‖

మహాగణేశ నిర్భిన్న విఘ్నయన్త్ర ప్రహర్షితా |

భణ్డాసురేన్ద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ ‖ ౩౧ ‖

కరాఙ్గుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః |

మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసుర సైనికా ‖ ౩౧ ‖

కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభణ్డాసుర శూన్యకా |

బ్రహ్మోపేన్ద్ర మహేన్ద్రాది దేవసంస్తుత వైభవా ‖ ౩౩ ‖

హరనేత్రాగ్ని సన్దగ్ధ కామ సఞ్జీవనౌషధిః |

శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖపఙ్కజా ‖ ౩౪ ‖

కణ్ఠాధః కటిపర్యన్త మధ్యకూట స్వరూపిణీ |

శక్తికూటైక తాపన్న కట్యధోభాగ ధారిణీ ‖ ౩౫ ‖

మూలమన్త్రాత్మికా, మూలకూట త్రయ కళేబరా |

కుళామృతైక రసికా, కుళసఙ్కేత పాలినీ ‖ ౩౬ ‖

కుళాఙ్గనా, కుళాన్తఃస్థా, కౌళినీ, కుళయోగినీ |

అకుళా, సమయాన్తఃస్థా, సమయాచార తత్పరా ‖ ౩౭ ‖

మూలాధారైక నిలయా, బ్రహ్మగ్రన్థి విభేదినీ |

మణిపూరాన్త రుదితా, విష్ణుగ్రన్థి విభేదినీ ‖ ౩౮ ‖

ఆజ్ఞా చక్రాన్తరాళస్థా, రుద్రగ్రన్థి విభేదినీ |

సహస్రారామ్బుజా రూఢా, సుధాసారాభి వర్షిణీ ॥ ౩౯ ॥

తటిల్లతా సమరుచిః, షట్-చక్రోపరి సంస్థితా ।

మహాశక్తిః, కుణ్డలినీ, బిసతన్తు తనీయసీ ॥ ౪౦ ॥

భవానీ, భావనాగమ్యా, భవారణ్య కుఠారికా ।

భద్రప్రియా, భద్రమూర్తి, ర్భక్తసౌభాగ్య దాయినీ ॥ ౪౧ ॥

భక్తిప్రియా, భక్తిగమ్యా, భక్తివశ్యా, భయాపహా ।

శామ్భవీ, శారదారాధ్యా, శర్వాణీ, శర్మదాయినీ ॥ ౪౨ ॥

శాఙ్కరీ, శ్రీకరీ, సాధ్వీ, శరచ్చన్ద్రనిభాననా ।

శాతోదరీ, శాన్తిమతీ, నిరాధారా, నిరఞ్జనా ॥ ౪౩ ॥

నిర్లేపా, నిర్మలా, నిత్యా, నిరాకారా, నిరాకులా ।

నిర్గుణా, నిష్కళా, శాన్తా, నిష్కామా, నిరుపప్లవా ॥ ౪౪ ॥

నిత్యముక్తా, నిర్వికారా, నిష్ప్రపఞ్చా, నిరాశ్రయా ।

నిత్యశుద్ధా, నిత్యబుద్ధా, నిరవద్యా, నిరన్తరా ॥ ౪౫ ॥

నిష్కారణా, నిష్కళఙ్కా, నిరుపాధి, ర్నిరీశ్వరా ।

నీరాగా, రాగమథనీ, నిర్మదా, మదనాశినీ ‖ ౪౬ ‖

నిశ్చిన్తా, నిరహఙ్కారా, నిర్మోహా, మోహనాశినీ |

నిర్మమా, మమతాహన్త్రీ, నిష్పాపా, పాపనాశినీ ‖ ౪౭ ‖

నిష్క్రోధా, క్రోధశమనీ, నిర్లోభా, లోభనాశినీ |

నిఃసంశయా, సంశయఘ్నీ, నిర్భవా, భవనాశినీ ‖ ౪౮ ‖

నిర్వికల్పా, నిరాబాధా, నిర్భేదా, భేదనాశినీ |

నిర్నాశా, మృత్యుమథనీ, నిష్క్రియా, నిష్పరిగ్రహా ‖ ౪౯ ‖

నిస్తులా, నీలచికురా, నిరపాయా, నిరత్యయా |

దుర్లభా, దుర్గమా, దుర్గా, దుఃఖహన్త్రీ, సుఖప్రదా ‖ ౫౦ ‖

దుష్టదూరా, దురాచార శమనీ, దోషవర్జితా |

సర్వజ్ఞా, సాన్ద్రకరుణా, సమానాధికవర్జితా ‖ ౫౧ ‖

సర్వశక్తిమయీ, సర్వమఙ్గళా, సద్గతిప్రదా |

సర్వేశ్వరీ, సర్వమయీ, సర్వమన్త్ర స్వరూపిణీ ‖ ౫౨ ‖

సర్వయన్త్రాత్మికా, సర్వతన్త్రరూపా, మనోన్మనీ |

మాహేశ్వరీ, మహాదేవీ, మహాలక్ష్మీ, ర్మృడప్రియా ॥ ౫౩ ॥

మహారూపా, మహాపూజ్యా, మహాపాతక నాశినీ ।

మహామాయా, మహాసత్త్వా, మహాశక్తి ర్మహారతిః ॥ ౫౪ ॥

మహాభోగా, మహైశ్వర్యా, మహావీర్యా, మహాబలా ।

మహాబుద్ధి, ర్మహాసిద్ధి, ర్మహాయోగేశ్వరేశ్వరీ ॥ ౫౫ ॥

మహాతన్త్రా, మహామన్త్రా, మహాయన్త్రా, మహాసనా ।

మహాయాగ క్రమారాధ్యా, మహాభైరవ పూజితా ॥ ౫౬ ॥

మహేశ్వర మహాకల్ప మహాతాణ్డవ సాక్షిణీ ।

మహాకామేశ మహిషీ, మహాత్రిపుర సున్దరీ ॥ ౫౭ ॥

చతుఃషష్ట్యుపచారాఢ్యా, చతుష్షష్టి కళామయీ ।

మహా చతుష్షష్టి కోటి యోగినీ గణసేవితా ॥ ౫౮ ॥

మనువిద్యా, చన్ద్రవిద్యా, చన్ద్రమణ్డలమధ్యగా ।

చారురూపా, చారుహాసా, చారుచన్ద్ర కళాధరా ॥ ౫౯ ॥

చరాచర జగన్నాథా, చక్రరాజ నికేతనా ।

పార్వతీ, పద్మనయనా, పద్మరాగ సమప్రభా ॥ ౬౦ ॥

పఞ్చప్రేతాసనాసీనా, పఞ్చబ్రహ్మ స్వరూపిణీ ।

చిన్మయీ, పరమానన్దా, విజ్ఞాన ఘనరూపిణీ ॥ ౬౧ ॥

ధ్యానధ్యాతృ ధ్యేయరూపా, ధర్మాధర్మ వివర్జితా ।

విశ్వరూపా, జాగరిణీ, స్వపన్తీ, తైజసాత్మికా ॥ ౬౨ ॥

సుప్తా, ప్రాజ్ఞాత్మికా, తుర్యా, సర్వావస్థా వివర్జితా ।

సృష్టికర్త్రీ, బ్రహ్మరూపా, గోప్త్రీ, గోవిన్దరూపిణీ ॥ ౬౩ ॥

సంహారిణీ, రుద్రరూపా, తిరోధానకరీశ్వరీ ।

సదాశివానుగ్రహదా, పఞ్చకృత్య పరాయణా ॥ ౬౪ ॥

భానుమణ్డల మధ్యస్థా, భైరవీ, భగమాలినీ ।

పద్మాసనా, భగవతీ, పద్మనాభ సహోదరీ ॥ ౬౫ ॥

ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః ।

సహస్రశీర్షవదనా, సహస్రాక్షీ, సహస్రపాత్ ॥ ౬౬ ॥

ఆబ్రహ్మ కీటజననీ, వర్ణాశ్రమ విధాయినీ ।

నిజాజ్ఞారూపనిగమా, పుణ్యాపుణ్య ఫలప్రదా || ౮౭ ||

శ్రుతి సీమన్త సిన్ధూరీకృత పాదాబ్జధూళికా |

సకలాగమ సన్దోహ శుక్తిసమ్పుట మౌక్తికా || ౮౮ ||

పురుషార్థప్రదా, పూర్ణా, భోగినీ, భువనేశ్వరీ |

అమ్బికా,ఽనాది నిధనా, హరిబ్రహ్మేన్ద్ర సేవితా || ౮౯ ||

నారాయణీ, నాదరూపా, నామరూప వివర్జితా |

హ్రీఙ్కారీ, హ్రీమతీ, హృద్యా, హేయోపాదేయ వర్జితా || ౯౦ ||

రాజరాజార్చితా, రాజ్ఞీ, రమ్యా, రాజీవలోచనా |

రఞ్జనీ, రమణీ, రస్యా, రణత్కిఙ్కిణి మేఖలా || ౯౧ ||

రమా, రాకేన్దువదనా, రతిరూపా, రతిప్రియా |

రక్షాకరీ, రాక్షసఘ్నీ, రామా, రమణలమ్పటా || ౯౨ ||

కామ్యా, కామకళారూపా, కదమ్బ కుసుమప్రియా |

కల్యాణీ, జగతీకన్దా, కరుణారస సాగరా || ౯౩ ||

కళావతీ, కళాలాపా, కాన్తా, కాదమ్బరీప్రియా |

వరదా, వామనయనా, వారుణీమదవిహ్వలా ‖ ౭౪ ‖

విశ్వాధికా, వేదవేద్యా, విన్ధ్యాచల నివాసినీ |

విధాత్రీ, వేదజననీ, విష్ణుమాయా, విలాసినీ ‖ ౭౫ ‖

క్షేత్రస్వరూపా, క్షేత్రేశీ, క్షేత్ర క్షేత్రజ్ఞ పాలినీ |

క్షయవృద్ధి వినిర్ముక్తా, క్షేత్రపాల సమర్చితా ‖ ౭౬ ‖

విజయా, విమలా, వన్ద్యా, వన్దారు జనవత్సలా |

వాగ్వాదినీ, వామకేశీ, వహ్నిమణ్డల వాసినీ ‖ ౭౭ ‖

భక్తిమత్-కల్పలతికా, పశుపాశ విమోచనీ |

సంహృతాశేష పాషణ్డా, సదాచార ప్రవర్తికా ‖ ౭౮ ‖

తాపత్రయాగ్ని సన్తప్త సమాహ్లాదన చన్ద్రికా |

తరుణీ, తాపసారాధ్యా, తనుమధ్యా, తమోఽపహా ‖ ౭౯ ‖

చితి, స్తత్పదలక్ష్యార్థా, చిదేక రసరూపిణీ |

స్వాత్మానన్దలవీభూత బ్రహ్మాద్యానన్ద సన్తతిః ‖ ౮౦ ‖

పరా, ప్రత్యక్చితీ రూపా, పశ్యన్తీ, పరదేవతా |

మధ్యమా, వైఖరీరూపా, భక్తమానస హంసికా ॥ ౮౧ ॥

కామేశ్వర ప్రాణనాడీ, కృతజ్ఞా, కామపూజితా ।

శృఙ్గార రససమ్పూర్ణా, జయా, జాలన్ధరస్థితా ॥ ౮౨ ॥

ఓడ్యాణ పీఠనిలయా, బిన్దుమణ్డల వాసినీ ।

రహోయాగ క్రమారాధ్యా, రహస్తర్పణ తర్పితా ॥ ౮౩ ॥

సద్యః ప్రసాదినీ, విశ్వసాక్షిణీ, సాక్షివర్జితా ।

షడఙ్గదేవతా యుక్తా, షాడ్గుణ్య పరిపూరితా ॥ ౮౪ ॥

నిత్యక్లిన్నా, నిరుపమా, నిర్వాణ సుఖదాయినీ ।

నిత్యా, షోడశికారూపా, శ్రీకణ్ఠార్ధ శరీరిణీ ॥ ౮౫ ॥

ప్రభావతీ, ప్రభారూపా, ప్రసిద్ధా, పరమేశ్వరీ ।

మూలప్రకృతి రవ్యక్తా, వ్యక్తాఽవ్యక్త స్వరూపిణీ ॥ ౮౬ ॥

వ్యాపినీ, వివిధాకారా, విద్యాఽవిద్యా స్వరూపిణీ ।

మహాకామేశ నయనా, కుముదాహ్లాద కౌముదీ ॥ ౮౭ ॥

భక్తహార్ద తమోభేద భానుమద్-భానుసన్తతిః ।

శివదూతీ, శివారాధ్యా, శివమూర్తి, శ్శివఙ్కరీ || ౮౮ ||

శివప్రియా, శివపరా, శిష్టేష్టా, శిష్టపూజితా |

అప్రమేయా, స్వప్రకాశా, మనోవాచామ గోచరా || ౮౯ ||

చిచ్ఛక్తి, శ్చేతనారూపా, జడశక్తి, ర్జడాత్మికా |

గాయత్రీ, వ్యాహృతి, స్సన్ధ్యా, ద్విజబృన్ద నిషేవితా || ౯౦ ||

తత్త్వాసనా, తత్త్వమయీ, పఞ్చకోశాన్తరస్థితా |

నిస్సీమమహిమా, నిత్యయౌవనా, మదశాలినీ || ౯౧ ||

మదఘూర్ణిత రక్తాక్షీ, మదపాటల గణ్డభూః |

చన్దన ద్రవదిగ్ధాఙ్గీ, చామ్పేయ కుసుమ ప్రియా || ౯౨ ||

కుశలా, కోమలాకారా, కురుకుళ్ళా, కులేశ్వరీ |

కుళకుణ్డాలయా, కౌళ మార్గతత్పర సేవితా || ౯౩ ||

కుమార గణనాథామ్బా, తుష్టిః, పుష్టి, ర్మతి, ర్ధృతిః |

శాన్తిః, స్వస్తిమతీ, కాన్తి, ర్నన్దినీ, విఘ్ననాశినీ || ౯౪ ||

తేజోవతీ, త్రినయనా, లోలాక్షీ కామరూపిణీ |

మాలినీ, హంసినీ, మాతా, మలయాచల వాసినీ || ౯౫ ||

సుముఖీ, నళినీ, సుభ్రూః, శోభనా, సురనాయికా |

కాలకణ్ఠీ, కాన్తిమతీ, క్షోభిణీ, సూక్ష్మరూపిణీ || ౯౬ ||

వజ్రేశ్వరీ, వామదేవీ, వయోఽవస్థా వివర్జితా |

సిద్ధేశ్వరీ, సిద్ధవిద్యా, సిద్ధమాతా, యశస్వినీ || ౯౭ ||

విశుద్ధి చక్రనిలయా,ఽఽరక్తవర్ణా, త్రిలోచనా |

ఖట్వాఙ్గాది ప్రహరణా, వదనైక సమన్వితా || ౯౮ ||

పాయసాన్నప్రియా, త్వక్స్థా, పశులోక భయఙ్కరీ |

అమృతాది మహాశక్తి సంవృతా, డాకినీశ్వరీ || ౯౯ ||

అనాహతాబ్జ నిలయా, శ్యామాభా, వదనద్వయా |

దంష్ట్రోజ్జ్వలా,ఽక్షమాలాధిధరా, రుధిర సంస్థితా || ౧౦౦ ||

కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా, స్నిగ్ధౌదనప్రియా |

మహావీరేన్ద్ర వరదా, రాకిణ్యమ్బా స్వరూపిణీ || ౧౦౧ ||

మణిపూరాబ్జ నిలయా, వదనత్రయ సంయుతా |

వజ్రాధికాయుధోపేతా, డామర్యాదిభి రావృతా || ౧౦౨ ||

రక్తవర్ణా, మాంసనిష్ఠా, గుడాన్న ప్రీతమానసా |

సమస్త భక్తసుఖదా, లాకిన్యమ్బా స్వరూపిణీ || ౧౦౩ ||

స్వాధిష్ఠానామ్బు జగతా, చతుర్వక్త్ర మనోహరా |

శూలాద్యాయుధ సమ్పన్నా, పీతవర్ణా,ఽతిగర్వితా || ౧౦౪ ||

మేదోనిష్ఠా, మధుప్రీతా, బన్దిన్యాది సమన్వితా |

దధ్యన్నాసక్త హృదయా, డాకినీ రూపధారిణీ || ౧౦౫ ||

మూలా ధారామ్బుజారూఢా, పఞ్చవక్త్రా,ఽస్థిసంస్థితా |

అఙ్కుశాది ప్రహరణా, వరదాది నిషేవితా || ౧౦౬ ||

ముద్గౌదనాసక్త చిత్తా, సాకిన్యమ్బాస్వరూపిణీ |

ఆజ్ఞా చక్రాబ్జనిలయా, శుక్లవర్ణా, షడాననా || ౧౦౭ ||

మజ్జాసంస్థా, హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా |

హరిద్రాన్నైక రసికా, హాకినీ రూపధారిణీ || ౧౦౮ ||

సహస్రదళ పద్మస్థా, సర్వవర్ణోప శోభితా |

సర్వాయుధధరా, శుక్ల సంస్థితా, సర్వతోముఖీ || ౧౦౯ ||

సర్వౌదన ప్రీతచిత్తా, యాకిన్యమ్బా స్వరూపిణీ |

స్వాహా, స్వధా,ఽమతి, ర్మేధా, శ్రుతిః, స్మృతి, రనుత్తమా || ౧౧౦ ||

పుణ్యకీర్తిః, పుణ్యలభ్యా, పుణ్యశ్రవణ కీర్తనా |

పులోమజార్చితా, బన్ధమోచనీ, బన్ధురాలకా || ౧౧౧ ||

విమర్శరూపిణీ, విద్యా, వియదాది జగత్ప్రసూః |

సర్వవ్యాధి ప్రశమనీ, సర్వమృత్యు నివారిణీ || ౧౧౨ ||

అగ్రగణ్యా,ఽచిన్త్యరూపా, కలికల్మష నాశినీ |

కాత్యాయినీ, కాలహన్త్రీ, కమలాక్ష నిషేవితా || ౧౧౩ ||

తామ్బూల పూరిత ముఖీ, దాడిమీ కుసుమప్రభా |

మృగాక్షీ, మోహినీ, ముఖ్యా, మృడానీ, మిత్రరూపిణీ || ౧౧౪ ||

నిత్యతృప్తా, భక్తనిధి, ర్నియన్త్రీ, నిఖిలేశ్వరీ |

మైత్ర్యాది వాసనాలభ్యా, మహాప్రళయ సాక్షిణీ || ౧౧౫ ||

పరాశక్తిః, పరానిష్ఠా, ప్రజ్ఞాన ఘనరూపిణీ |

మాధ్వీపానాలసా, మత్తా, మాతృకా వర్ణ రూపిణీ || ౧౧౬ ||

మహాకైలాస నిలయా, మృణాల మృదుదోర్లతా |

మహనీయా, దయామూర్తి, ర్మహాసామ్రాజ్యశాలినీ || ౧౧౭ ||

ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీవిద్యా, కామసేవితా |

శ్రీషోడశాక్షరీ విద్యా, త్రికూటా, కామకోటికా || ౧౧౮ ||

కటాక్షకిఙ్కరీ భూత కమలా కోటిసేవితా |

శిరఃస్థితా, చన్ద్రనిభా, ఫాలస్థేన్ద్ర ధనుఃప్రభా || ౧౧౯ ||

హృదయస్థా, రవిప్రఖ్యా, త్రికోణాన్తర దీపికా |

దాక్షాయణీ, దైత్యహన్త్రీ, దక్షయజ్ఞ వినాశినీ || ౧౨౦ ||

దరాన్దోళిత దీర్ఘాక్షీ, దరహాసోజ్జ్వలన్ముఖీ |

గురుమూర్తి, ర్గుణనిధి, ర్గోమాతా, గుహజన్మభూః || ౧౨౧ ||

దేవేశీ, దణ్డనీతిస్థా, దహరాకాశ రూపిణీ |

ప్రతిపన్ముఖ్య రాకాన్త తిథిమణ్డల పూజితా || ౧౨౨ ||

కళాత్మికా, కళానాథా, కావ్యాలాప వినోదినీ |

సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా || ౧౨౩ ||

ఆదిశక్తి, రమేయా,ఉఉత్మా, పరమా, పావనాకృతిః |

అనేకకోటి బ్రహ్మాణ్డ జననీ, దివ్యవిగ్రహా || ౧౨౪ ||

క్లీఙ్కారీ, కేవలా, గుహ్యా, కైవల్య పదదాయినీ |

త్రిపురా, త్రిజగద్వన్ద్యా, త్రిమూర్తి, స్త్రిదశేశ్వరీ || ౧౨౫ ||

త్ర్యక్షరీ, దివ్యగన్ధాఢ్యా, సిన్ధూర తిలకాఞ్చితా |

ఉమా, శైలేన్ద్రతనయా, గౌరీ, గన్ధర్వ సేవితా || ౧౨౬ ||

విశ్వగర్భా, స్వర్ణగర్భా,ఉవరదా వాగధీశ్వరీ |

ధ్యానగమ్యా,ఉపరిచ్ఛేద్యా, జ్ఞానదా, జ్ఞానవిగ్రహా || ౧౨౭ ||

సర్వవేదాన్త సంవేద్యా, సత్యానన్ద స్వరూపిణీ |

లోపాముద్రార్చితా, లీలాక్లుప్త బ్రహ్మాణ్డమణ్డలా || ౧౨౮ ||

అదృశ్యా, దృశ్యరహితా, విజ్ఞాత్రీ, వేద్యవర్జితా |

యోగినీ, యోగదా, యోగ్యా, యోగానన్దా, యుగన్ధరా ॥ ౧౨౯ ॥

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ ।

సర్వధారా, సుప్రతిష్ఠా, సదసద్-రూపధారిణీ ॥ ౧౩౦ ॥

అష్టమూర్తి, రజాజైత్రీ, లోకయాత్రా విధాయినీ ।

ఏకాకినీ, భూమరూపా, నిర్ద్వైతా, ద్వైతవర్జితా ॥ ౧౩౧ ॥

అన్నదా, వసుదా, వృద్ధా, బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ ।

బృహతీ, బ్రాహ్మణీ, బ్రాహ్మీ, బ్రహ్మానన్దా, బలిప్రియా ॥ ౧౩౨ ॥

భాషారూపా, బృహత్సేనా, భావాభావ వివర్జితా ।

సుఖారాధ్యా, శుభకరీ, శోభనా సులభాగతిః ॥ ౧౩౩ ॥

రాజరాజేశ్వరీ, రాజ్యదాయినీ, రాజ్యవల్లభా ।

రాజత్-కృపా, రాజపీఠ నివేశిత నిజాశ్రితాః ॥ ౧౩౪ ॥

రాజ్యలక్ష్మీః, కోశనాథా, చతురఙ్గ బలేశ్వరీ ।

సామ్రాజ్యదాయినీ, సత్యసన్ధా, సాగరమేఖలా ॥ ౧౩౫ ॥

దీక్షితా, దైత్యశమనీ, సర్వలోక వశఙ్కరీ ।

సర్వార్థదాత్రీ, సావిత్రీ, సచ్చిదానన్ద రూపిణీ || ౧౩౬ ||

దేశకాలాఽపరిచ్ఛిన్నా, సర్వగా, సర్వమోహినీ |

సరస్వతీ, శాస్త్రమయీ, గుహామ్బా, గుహ్యరూపిణీ || ౧౩౭ ||

సర్వోపాధి వినిర్ముక్తా, సదాశివ పతివ్రతా |

సమ్ప్రదాయేశ్వరీ, సాధ్వీ, గురుమణ్డల రూపిణీ || ౧౩౮ ||

కులోత్తీర్ణా, భగారాధ్యా, మాయా, మధుమతీ, మహీ |

గణామ్బా, గుహ్యకారాధ్యా, కోమలాఙ్గీ, గురుప్రియా || ౧౩౯ ||

స్వతన్త్రా, సర్వతన్త్రేశీ, దక్షిణామూర్తి రూపిణీ |

సనకాది సమారాధ్యా, శివజ్ఞాన ప్రదాయినీ || ౧౪౦ ||

చిత్కళా,ఽనన్దకలికా, ప్రేమరూపా, ప్రియఙ్కరీ |

నామపారాయణ ప్రీతా, నన్దివిద్యా, నటేశ్వరీ || ౧౪౧ ||

మిథ్యా జగదధిష్ఠానా ముక్తిదా, ముక్తిరూపిణీ |

లాస్యప్రియా, లయకరీ, లజ్జా, రమ్భాది వన్దితా || ౧౪౨ ||

భవదావ సుధావృష్టిః, పాపారణ్య దవానలా |

దౌర్భాగ్యతూల వాతూలా, జరాధ్వాన్త రవిప్రభా || ౧౪౩ ||

భాగ్యాబ్ధిచన్ద్రికా, భక్తచిత్తకేకి ఘనాఘనా |

రోగపర్వత దమ్భోళి, ర్మృత్యుదారు కుఠారికా || ౧౪౪ ||

మహేశ్వరీ, మహాకాళీ, మహాగ్రాసా, మహాఽశనా |

అపర్ణా, చణ్డికా, చణ్డముణ్డాఽసుర నిషూదినీ || ౧౪౫ ||

క్షరాక్షరాత్మికా, సర్వలోకేశీ, విశ్వధారిణీ |

త్రివర్గదాత్రీ, సుభగా, త్ర్యమ్బకా, త్రిగుణాత్మికా || ౧౪౬ ||

స్వర్గాపవర్గదా, శుద్ధా, జపాపుష్ప నిభాకృతిః |

ఓజోవతీ, ద్యుతిధరా, యజ్ఞరూపా, ప్రియవ్రతా || ౧౪౭ ||

దురారాధ్యా, దురాదర్షా, పాటలీ కుసుమప్రియా |

మహతీ, మేరునిలయా, మన్దార కుసుమప్రియా || ౧౪౮ ||

వీరారాధ్యా, విరాడ్రూపా, విరజా, విశ్వతోముఖీ |

ప్రత్యగ్రూపా, పరాకాశా, ప్రాణదా, ప్రాణరూపిణీ || ౧౪౯ ||

మార్తాణ్డ భైరవారాధ్యా, మన్త్రిణీ న్యస్తరాజ్యధూః |

త్రిపురేశీ, జయత్సేనా, నిస్త్రైగుణ్యా, పరాపరా ॥ ౧౫౦ ॥

సత్యజ్ఞానాఽనన్దరూపా, సామరస్య పరాయణా ।

కపర్దినీ, కలామాలా, కామధుక్,కామరూపిణీ ॥ ౧౫౧ ॥

కళానిధిః, కావ్యకళా, రసజ్ఞా, రసశేవధిః ।

పుష్టా, పురాతనా, పూజ్యా, పుష్కరా, పుష్కరేక్షణా ॥ ౧౫౨ ॥

పరఞ్జ్యోతిః, పరన్ధామ, పరమాణుః, పరాత్పరా ।

పాశహస్తా, పాశహన్త్రీ, పరమన్త్ర విభేదినీ ॥ ౧౫౩ ॥

మూర్తా,ఽమూర్తా,ఽనిత్యతృప్తా, ముని మానస హంసికా ।

సత్యవ్రతా, సత్యరూపా, సర్వాన్తర్యామినీ, సతీ ॥ ౧౫౪ ॥

బ్రహ్మాణీ, బ్రహ్మజననీ, బహురూపా, బుధార్చితా ।

ప్రసవిత్రీ, ప్రచణ్డాఽజ్ఞా, ప్రతిష్ఠా, ప్రకటాకృతిః ॥ ౧౫౫ ॥

ప్రాణేశ్వరీ, ప్రాణదాత్రీ, పఞ్చాశత్-పీఠరూపిణీ ।

విశృఙ్ఖలా, వివిక్తస్థా, వీరమాతా, వియత్ప్రసూః ॥ ౧౫౬ ॥

ముకున్దా, ముక్తి నిలయా, మూలవిగ్రహ రూపిణీ |

భావజ్ఞా, భవరోగఘ్నీ భవచక్ర ప్రవర్తినీ || ౧౫౭ ||

ఛన్దస్సారా, శాస్త్రసారా, మన్త్రసారా, తలోదరీ |

ఉదారకీర్తి, రుద్దామవైభవా, వర్ణరూపిణీ || ౧౫౮ ||

జన్మమృత్యు జరాతప్త జన విశ్రాన్తి దాయినీ |

సర్వోపనిష దుద్ఘుష్టా, శాన్త్యతీత కళాత్మికా || ౧౫౯ ||

గమ్భీరా, గగనాన్తఃస్థా, గర్వితా, గానలోలుపా |

కల్పనారహితా, కాష్ఠా, కాన్తా, కాన్తార్ధ విగ్రహా || ౧౬౦ ||

కార్యకారణ నిర్ముక్తా, కామకేళి తరఙ్గితా |

కనత్-కనకతాటఙ్కా, లీలావిగ్రహ ధారిణీ || ౧౬౧ ||

అజాక్షయ వినిర్ముక్తా, ముగ్ధా క్షిప్రప్రసాదినీ |

అన్తర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా || ౧౬౨ ||

త్రయీ, త్రివర్గ నిలయా, త్రిస్థా, త్రిపురమాలినీ |

నిరామయా, నిరాలమ్బా, స్వాత్మారామా, సుధాసృతిః || ౧౬౩ ||

సంసారపఙ్క నిర్మగ్న సముద్ధరణ పణ్డితా |

యజ్ఞప్రియా, యజ్ఞకర్త్రీ, యజమాన స్వరూపిణీ || ౧౬౪ ||

ధర్మాధారా, ధనాధ్యక్షా, ధనధాన్య వివర్ధినీ |

విప్రప్రియా, విప్రరూపా, విశ్వభ్రమణ కారిణీ || ౧౬౫ ||

విశ్వగ్రాసా, విద్రుమాభా, వైష్ణవీ, విష్ణురూపిణీ |

అయోని, ర్యోనినిలయా, కూటస్థా, కులరూపిణీ || ౧౬౬ ||

వీరగోష్ఠీప్రియా, వీరా, నైష్కర్మ్యా, నాదరూపిణీ |

విజ్ఞాన కలనా, కల్యా విదగ్ధా, బైన్దవాసనా || ౧౬౭ ||

తత్త్వాధికా, తత్త్వమయీ, తత్త్వమర్థ స్వరూపిణీ |

సామగానప్రియా, సౌమ్యా, సదాశివ కుటుమ్బినీ || ౧౬౮ ||

సవ్యాపసవ్య మార్గస్థా, సర్వాపద్వి నివారిణీ |

స్వస్థా, స్వభావమధురా, ధీరా, ధీర సమర్చితా || ౧౬౯ ||

చైతన్యార్ఘ్య సమారాధ్యా, చైతన్య కుసుమప్రియా |

సదోదితా, సదాతుష్టా, తరుణాదిత్య పాటలా || ౧౭౦ ||

దక్షిణా, దక్షిణారాధ్యా, దరస్మేర ముఖామ్బుజా |

కౌళినీ కేవలా,ఽనర్ఘ్యా కైవల్య పదదాయినీ || ౧౭౧ ||

స్తోత్రప్రియా, స్తుతిమతీ, శ్రుతిసంస్తుత వైభవా |

మనస్వినీ, మానవతీ, మహేశీ, మఙ్గళాకృతిః || ౧౭౨ ||

విశ్వమాతా, జగద్ధాత్రీ, విశాలాక్షీ, విరాగిణీ|

ప్రగల్భా, పరమోదారా, పరామోదా, మనోమయీ || ౧౭౩ ||

వ్యోమకేశీ, విమానస్థా, వజ్రిణీ, వామకేశ్వరీ |

పఞ్చయజ్ఞప్రియా, పఞ్చప్రేత మఞ్చాధిశాయినీ || ౧౭౪ ||

పఞ్చమీ, పఞ్చభూతేశీ, పఞ్చ సఙ్ఖ్యోపచారిణీ |

శాశ్వతీ, శాశ్వతైశ్వర్యా, శర్మదా, శమ్భుమోహినీ || ౧౭౫ ||

ధరా, ధరసుతా, ధన్యా, ధర్మిణీ, ధర్మవర్ధినీ |

లోకాతీతా, గుణాతీతా, సర్వాతీతా, శమాత్మికా || ౧౭౬ ||

బన్ధూక కుసుమ ప్రఖ్యా, బాలా, లీలావినోదినీ |

సుమఙ్గళీ, సుఖకరీ, సువేషాఢ్యా, సువాసినీ || ౧౭౭ ||

సువాసిన్యర్చనప్రీతా, శోభనా, శుద్ధ మానసా |
బిన్దు తర్పణ సన్తుష్టా, పూర్వజా, త్రిపురామ్బికా || ౧౭౮ ||
దశముద్రా సమారాధ్యా, త్రిపురా శ్రీవశఙ్కరీ |
జ్ఞానముద్రా, జ్ఞానగమ్యా, జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ || ౧౭౯ ||
యోనిముద్రా, త్రిఖణ్డేశీ, త్రిగుణామ్బా, త్రికోణగా |
అనఘాద్భుత చారిత్రా, వాంఛితార్థ ప్రదాయినీ || ౧౮౦ ||
అభ్యాసాతి శయజ్ఞాతా, షడధ్వాతీత రూపిణీ |
అవ్యాజ కరుణామూర్తి, రజ్ఞానధ్వాన్త దీపికా || ౧౮౧ ||
ఆబాలగోప విదితా, సర్వానుల్లఙ్ఘ్య శాసనా |
శ్రీ చక్రరాజనిలయా, శ్రీమత్త్రిపుర సున్దరీ || ౧౮౨ ||
శ్రీ శివా, శివశక్త్యైక్య రూపిణీ, లలితామ్బికా |
ఏవం శ్రీలలితాదేవ్యా నామ్నాం సాహస్రకం జగుః || ౧౮౩ ||

|| ఇతి శ్రీ బ్రహ్మాణ్డపురాణే, ఉత్తరఖణ్డే, శ్రీ హయగ్రీవాగస్త్య సంవాదే, శ్రీలలితారహస్యనామ శ్రీ లలితా రహస్యనామ సాహస్రస్తోత్ర కథనం నామ ద్వితీయోఽధ్యాయః సంపూర్ణః ||

దశాంగం గుగ్గిలోపేతం చందనాగరు సంయుతం !
కర్పూరలాక్షా సంయుక్తో ధూపోయం ప్రతి గృహ్యతాం !!
లాక్షా సమిలితైస్సితాభ్ర సహితై: శ్రీవాస సంమిశ్రితై: !
కర్పూరా కలితైస్సితా మధుయుతైర్గోసర్పిషా దూపితై: !!
శ్రీ ఖండా గురు గుగ్గిల ప్రభృతిభిర్నానావిధైర్వస్తుభి: !
ధూపంతే పరికల్పయామి జననీ ధూపంత్వమంగీకురు !!
ఓం యత్పురుషం --- ఉచ్యతే !
ఓం కర్దమేన --- మాలినీం !

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః ధూపం సమర్పయామి. **31.**

గోఘృతా వర్తి సంయుక్తా దీపమాలా మనోహరా !
అజ్ఞానమంధకారంమే నివారయతు సోజ్వలా !!
రత్నాలంకృత హేమపాత్ర నిహితైర్గో సర్పిషా పూరితై: !
దీపైర్ దీర్ఘతరాంధకారభిదురైర్ బాలార్క కోటి ప్రభై: !

ఆతామ్రుజ్వల దుజ్వల జ్వల నవద్రత్న ప్రభా దీపితై: !
మాతస్త్వామహమాదరాదనుదినం నీరాజయామ్యంబికే !!
ఓం బ్రాహ్మణో --- అజాయత !
ఓం ఆపస్రజంతు --- మేకులే !!

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః దీపం దర్శయామి. 32.

మహతి కనకపాత్రే స్థాపయిత్వా విశాలాన్ !
తపన సదృశరూపాన్ అంధకార ప్రభేదాన్ !
బహుఘృత మథతేషున్యస్త దీపానకంపాన్ !
భువన జనని కుర్వే నిత్యమారార్తి కంతే !!
సవినయమథ కృత్వా జాను యుగ్మం ధరణ్యాం !
సపది శిరసి ధృత్వా పాత్రమారార్తికస్య !
ముఖ కమల సమీపేతే అంబ సార్ధం త్రివారం !
భ్రమయతి మయి భూయాదాశుసార్ద్రః కటాక్షః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః కుంభార్తిక్య దీపం దర్శయామి. (ఇక్కడ కుంభ దీపమును వెలిగించి మోకాల్లపైన కూర్చొని ఆ కుంభ దీపాన్ని శిరసు పైన పెట్టుకొని నమస్కరించి ఆ పైన ఆ దీపాన్ని అమ్మవారి ముఖం దగ్గరగా తీసుకెళ్ళి ఆ

వెలుగులో అమ్మవారిని చూసాక 3 సార్లు అమ్మవారి చుట్టూ హరతిలాగా చూపించాలి.) 33.

సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చ రసైశ్షడ్భి: సమన్వితం !
నైవేద్యం మానసోభీష్టం మహాలక్ష్మీర్నివేదయే !!
మాతస్త్వాం దధి దుగ్ధ పాయస మహాశాల్యాన్న సంతానికా !
సూపాపూప సితాఘృతై: సవటకై: సక్షౌద్ర రంభాఫలై: !
ఏలా జీరక హింగూనాగరనిశాకుస్తుంబరీ సంస్కృతై: !
శాకైస్సాక మహం సుధాధి కరసై స్సంతర్పయామ్యంబికే !!
సాపూప సూప దధి దుగ్ధ సితా ఘృతాని !
సుస్వాదు యుక్త పరమాన్న పురస్కృతాని !!
శాకొల్ల సన్మరిచి జీరక బాహ్లికాని !
భక్ష్యాణి భక్ష్య జగదంబ మయార్పితాని !!
క్షీరమేతదిదముత్తమోత్తమంప్రాజ్యమాజ్యమిదముజ్వలం మధు !
మాతరే తదమృతోపమంత్రయం సంభ్రమేణ పరిపీయతాం ముహు: !
ఓం చంద్రమా మనసో .... రజాయత !
ఓం ఆర్ద్రాం పుష్క .... మమావహ !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః మహా నైవేద్యం నివేదయామి ! 34

పానీయం పావనం శ్రేష్ఠం గంగాది సలిదుద్భవం !
హస్త ప్రక్షాళనం దేవి గృహాణ ముఖ శోధనం !!
ఉష్ణోదకై: పాణియుగం ముఖంచ ప్రక్షాల్య మాతః కలధౌత పాత్రే ! కర్పూర మిశ్రేణ సకుంకుమేన హస్తౌ సముద్వర్తయ చందనేన !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
హస్త ప్రక్షాళనం సమర్పయామి. 35
అతి శీత సుశీర వాసితం తపనీయ కలశే నివేదితం !
పటపూట మిదంజితామృతం శుచి గంగామృతమంబ పీయతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
పానీయం సమర్పయామి. 36
ఇదం ఫలం మాయాదేవి స్థాపితం పురతస్తవ !
తేనమే సఫలావాప్తి: భావేజ్జన్మని జన్మని !!
తామ్రామ్ర రంభా ఫల సంయుతాని ద్రాక్షాఫల క్షౌద్ర సమన్వితాని !
సనారికేళాని సదాడిమాని ఫలానితే దేవి సమర్పయామి !!
కూష్మాండ కోశాతక సమ్మితాని జంబీర నారంగ సమన్వితాని !
సబీజ పూరాణి సజాంబవాని ఫలానితే దేవి సమర్పయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వత్యై నమః
ఫలం సమర్పయామి. 37

కర్పూర నాగాల్లీభి: క్రముకైర్ భ్రాజితం తథా !
ఏలా లవంగ సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం !!
కర్పూరేణ యుతైర్ లవంగ సహితై: తక్కోల చూర్ణాన్వితై: !
సుస్వాదుక్రముకైస్సగౌర ఖదిరైస్సుస్నిగ్ధ జాతీ ఫలై: !!
మాతః కైతక పత్ర పాండు రుచిరై: తాంబూలమంగీకురు !!
ఏలా లవంగాది సమన్వితాని తక్కోల కర్పూర విమిశ్రితాని !
తాంబూల వల్లీ దళ సంయుతాని పూగానితే దేవి సమర్పయామి !!
తాంబూల వల్లి దళ నిర్జిత హేమవర్ణం స్వర్ణాక్త పూగ ఫల మౌక్తిక చూర్ణ యుక్తం !
రత్నస్థ గస్థితమిదం ఖదిరేణ సార్థం తాంబూలమంబ వదనాంబురు హే గృహాణ !!
ఓం నాభ్యా ఆసీ --- అకల్పయన్ !
ఓం ఆర్ద్రాం యః కరిణీం --- మమావహ !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః నైవేద్య అనంతరం ముఖ సువాసనార్థం తాంబూలం
సమర్పయామి. 38
స్వర్ణం పవిత్రమమలం సర్వపాప వినాశనం !
సర్వైశ్వర్య ప్రదం యస్మాద్ అదశ్శాంతిమ్ ప్రయచ్ఛమే !!
అథ బహుమణి మిశ్రైర్ మౌక్తికైస్త్వాం వికీర్య,
త్రిభువన కమనీయై: పూజయిత్వాచ వస్త్రై: !

మిళిత వివిధ ముక్తాం దివ్య మాణిక్య యుక్తాం,
జనని కనక వృష్టిం దక్షిణాంతేర్పయామి !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
సువర్ణపుష్ప యుక్త దక్షిణాం
సమర్పయామి. 39.
మాతః కాంచన దండ మండితమిదం పూర్ణేందు బింబ ప్రభం !
నానారత్న విశోభి హేమకలశం లోకత్రయాహ్లాదకం !!
భాస్వన్మౌక్తిక జాలికా పరివృతం ప్రీత్యాత్మ హస్తే ధృతం !
ఛత్రంతే పరికల్పయామి జనని త్వష్ట్రా స్వయం నిర్మితం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః ఛత్రం
సమర్పయామి. ( అమ్మవారికి అందంగా అలంకరింపబడిన గొడుగును
పట్టాలి.) 40.
శరదిందు మరీచి గౌరవర్ణైర్మణి ముక్తా విలసత్సువర్ణ దండైః !
జగదంబ విచిత్ర చామరైస్త్వాం అహమానంద భరేణ వీజయామి !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
చామరాభ్యాం వీజయామి. 41
( ఇక్కడ అమ్మవారికి నెమలి పించాలతో తయారుచేసిన రెండు
అందమైన చామరములతో/విసనకర్రతో విసరాలి.)

మార్తాండ మండల నిభో జగదంబయోయం భక్త్యా మయా
మణిమయోముకురోర్పితస్తే ! పూర్ణేందు బింబ రుచిరం వదనం
స్వకీయ్యమస్మిన్ విలోక్య విలోల విలోచనేత్వం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
దర్పణం దర్శయామి. 42.
( ఇక్కడ .. అందంగా అలంకరింపబడిన అమ్మవారికి అద్దం
చూపించాలి. ఆ అద్దంలో మనము అమ్మవారి రూపాన్ని చూడాలి )
కర్పూర వర్తి సంయుక్తం దీపమాలా విరాజితం !
నీరాజనం గృహాణత్వం నారాయణి నమోస్తుతే !!
ఇంద్రాదయోనతి శతైర్ మకుట ప్రదీపైర్ !
నీరాజయంతి సతతం తవపాద పీఠమ్ !!
తస్మాదహం తవ సమస్త శరీరమేతన్ !
నీరాజయామి జగదంబ సహస్రదీపై: !!
ఓం వేదాహ మేతం --- యదాస్తే !
ఓం తాం మ ఆవహ --- నహం !
ఓం హిరణ్య పాత్రం --- దధాతి !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః మహా
మంగళ నీరాజనం దర్శయామి. 43
( ఇక్కడ మంగళహారతితో శ్రావ్యమైన సంగీతపరమైన హారతి పాటలు
పాడాలి )

క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే !
జాతీ పున్నాగ పుష్పైశ్చ గృహాణ కుసుమాంజలిం !!
చరణ నలిన యుగ్మం పంకజై: పూజయిత్వా కనక కమల మాలాం కంఠ దేశేర్పయిత్వా !
శిరసి వినిహతోయం రత్న పుష్పాంజలిస్తే హృదయ కమల మధ్యే హర్ష వర్షంతనోతు !!
ఓం ధాతా --- విద్యతే !
ఓం యశ్శుచి: --- జపేత్ !!
ఓం సహస్ర శీర్షా పురుషః --- యోపాం పుష్పం --- శివోం !!
ఓం  ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః మంత్ర పుష్పాంజలిం దర్శయామి.    44.
( ఇక్కడ సమయాన్ని బట్టి లఘు లేదా మహా మంత్ర పుష్పం దుర్గా సూక్తం చెప్పుకోవాలి )
పదే పదే యా పరిపూజ్యకే భ్య: సద్యోశ్వమేధాది ఫలం దదాసి !
తాం సర్వ పాపక్షయ హేతు భూతాం ప్రదక్షిణై: త్వాం పరితః కరోమి !
యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ !
తాని తాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదే పదే !
పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాప  సంభవః !
త్రాహిమాం కృపయా దేవీ  శరణాగత వత్సలే  !

అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ !
తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష పరమేశ్వరీ !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః ప్రదక్షిణ త్రయం సమర్పయామి. 45. ( పుష్పాక్షితలు తీసుకొని మూడు ప్రదక్షిణలు చేసి అమ్మవారి పాదాలవద్ద సమర్పించాలి ).

రక్తోత్పలారక్త కలా ప్రభాభ్యాం ధ్వజోర్ధ్వరేఖా కులిశాం కుశాభ్యాం !
అశేష బృందారక వందితాభ్యాం నమో భవానీ పదపంకజాభ్యాం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః నమస్కారాన్ సమర్పయామి . 46.
ప్రియగతి రతి తుంగో రత్న పల్యాణ యుక్తః కనక మయ విభూషణ స్నిగ్ధ గంభీర ఘోషః ! భగవతి కలితోయం వాహనార్థం మయాతే తురగ శత సమేతో వాయువేగస్తురంగః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః అశ్వాన్ ఆరోహయామి. 47
మధుకర వృత కుంభన్యస్త సింధూర రేణు: కనక కలిత ఘంటా కింకిణీ శోభికంఠః !
శ్రవణ యుగళ చంచచ్చామరో మేఘతుల్యో జనని తవముదేస్యాన్మత్త మాతంగ ఏషః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః 48.

ధృతతర తురగైర్విరాజమానం మణిమయ చక్ర చతుష్టయేన యుక్తం !
కనకమయ మహం వితాన వంతం భగవతి తేహి రథం సమర్పయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః రథం సమర్పయామి 49.

హయగజ రథపత్తి శోభమానం దిశి దిశి దుందుభి మేఘునాథ యుక్తం !
అతి బహుచతురంగసైన్యమేతద్భగవతి భక్తి భరేణ తేర్పయామి.!!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః చతురంగ సైన్యం సమర్పయామి. 50.

పరిఘీకృత సప్త సాగరం బహు సంపత్సహితం మయాంబతే !
విపులం ధరిణీ తలాభిదం ప్రబలం దుర్గమహం సమర్పయామి !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః దుర్గం సమర్పయామి. 51.

శతపత్ర యుతై: స్వభావ శీతై రతి సౌరభ్యయుతై: పరాగ పీతై: !
భ్రమరీ ముఖరీ కృతైరనంతైర్వ్యజనైస్త్వాం జగదంబ వీజయామి !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః వ్యజనం సమర్పయామి.

భ్రమ విలుళిత లోల కుంతలాళీవిగళిత మాల్య వికీర్ణ రంగ భూమి:!
ఇయమతి రుచిరా నటీ నటంతీ తవ హృదయే ముదమాతనోతు మాతః !!
ముఖ కమల విలాస లోలవేణీ విలసిత నిర్జిత లోల భృంగ మాలాః !
యువజన సుఖకారు చారుశీలా భగవతి తే పురతో నటంతి బాలాః !!

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః నాట్యం సమర్పయామి. 53.

భ్రమదళికుల తుల్యాలోల ధమ్మిల్ల భారా స్మిత ముఖ కమలోద్యద్దివ్య లావణ్య పూరాః !

అనుపమిత సువేషా వారయోషా నటంతి పరభృత కలకంఠ: యన్త్రేస్తు దృక్పాన పాత్రం !! ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః దృక్పాన పాత్రం సమర్పయామి. 54.

రుచిర కుచ తటీనాం నాట్యకాలే నటీనాం ప్రతిగ్రుహ మథతత్ర ప్రత్యహం ప్రాదురాసీత్ !

ధిమికి ధిమికి దిద్ధి దిద్ధి దిద్ధి ద్ధిగత థిగత తత్తైథయ్య థయ్యేతి శబ్దః !

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః నాట్యం సమర్పయామి. 55.

ఢమరు డిండిమ జర్ఘర ఝల్లరీ మృదురవత్ ద్రగడ ద్రగడాదయః !

ఝడితి ఝాంకృత ఝాంకృత ఝాంకృతై: జన హృదయం హృదయం సుఖయంతుతే !!

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః

గంధర్వ కన్యాగానం సమర్పయామి 56.

అభినయ కమనీయై: నర్తనైర్ నర్తకీనాం క్షణ మపిరమయిత్వా చేత
ఎతత్వదీయం !
స్వయ మహమతి చిత్రైర్ నృత్య వాదిత గీతైర్ భగవతి భవదీయం
మానసం రంజయామి !! ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ
మహాసరస్వత్యై నమః అనేక విధ వాద్యాని సమర్పయామి. 57.

తవదేవి గుణాను వర్ణనే చతురాననో చతురాననాదయః !
తదిహైక ముఖేషు జంతుషు స్తవనం కస్తవకర్తు మీశ్వరః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
క్షమాపణం సమర్పయామి 58.

అథ మణిమయ మంచకాభిరామే కనకమయ వితాన రాజమానే !
ప్రసర దగరు ధూప ధూపితేస్మిన్ భగవతి భక్త గృహేస్తుతే నివాసః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః సువర్ణ
భక్త గృహ నివాసం సమర్పయామి.. 59.

ఏతస్మిన్ మణి ఖచితే సువర్ణపీఠే త్రైలోక్యాభయవరదౌ నిధాయ పాదౌ !
విస్తీర్ణే మృదుల తరోత్త రచ్ఛదేస్మిన్ పర్యంకే కనకమయే నిషీద మాతః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః సువర్ణ
పర్యంకోపవేశనం సమర్పయామి. 60.

అథమాతరుశీరవాసితం నిజతాంబూల రసేన రంజితం !
తపనీయమయేహిపట్టకే ముఖ గండూష జలం విధీయతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
గండూష జలపాత్రం సమర్పయామి. 61.

తవదేవి సరోజ చిహ్నయో: పదయోర్నిర్జిత పద్మరాగయో: !
అతిత రక్త తలైరలక్తకై: పునరుక్తాం రచయామి రక్తతాం !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
పాదయో: లాక్షారంజనం సమర్పయామి. 62.

క్షణమథ జగదంబ మంచకేస్మిన్ మృదుతర తూలికయా విరాజమానే !
అతిరహసి ముదాశివేన సార్ధం సుఖశయనం కురుమాం హృదిస్మరంతీ !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
సుఖశయనం సమర్పయామి. 63.

ఏషా భక్త్యా తవ విరచితా యా మయాదేవి పూజా ! స్వీకృత్యైనాం సపది
సకలాన్ మేపరాధాన్ క్షమస్వ ! న్యూనం యత్తతవ తరుణయా పూర్ణతా
మేతు సద్య ! సానందమే హృదయ కమలే తేస్తు నిత్యం నివాసః !!
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః మమ
హృదయే నిత్య నివాసం సమర్పయామి.

పూజామిమాం యః పఠతి ప్రభాతే మధ్యాహ్నకాలే యదివా ప్రదోషే !
ధర్మార్ధ కామాన్ పురుషోలభేత దేహావసానే శివ భావమేతి !!
పూజామిమాం పఠేన్నిత్యం పూజా కర్తుమనీశ్వరః !
పూజాఫలమవాప్నోతి వాంఛితార్థంచ విందతి !!
ప్రత్యహం భక్తి సంయుక్తో యః పూజనమిదం పఠేత్ !
వాగ్వాదిన్యాః ప్రసాదేనవత్సరాత్సకవిర్భవేత్ !!
చతుర్భుజాం త్రినేత్రాంచ వరదాభయ ధారిణీం !
సింహారూఢాం మహాదేవీం సర్వైశ్వర్య ప్రదాయినీం !!
ముక్తాకుందేందు గౌరాం మణిమయ మకుటాం రత్నతాటంక యుక్తాం !
అక్షస్రక్ పుష్ప హస్తాం అభయ వరకరాం చంద్ర చూడాం త్రినేత్రాం !!
నానాలంకార యుక్తాం సురమకుట మణిద్యోతిత స్వర్ణపీఠాం !
సానందం సుప్రసన్నాం త్రిభువన జననీం చేతసా చిన్తయామీ !
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః
ప్రార్థనం సమర్పయామి

పుత్రాన్ దేహి యశోదేహి సౌభాగ్యం దేహి సువ్రతే !
కాళి కాళి మహాకాళి వికరాళి నమోస్తుతే !!
త్రైలోక్య జనని త్రాహి వరదే భక్త వత్సలే !
గృహాణర్ఘ్యం మయాదత్తం మహాలక్ష్మీ నమోస్తుతే !! ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వత్యై నమః ప్రసన్నార్ఘ్యం సమర్పయామి.

యాదేవీ మధుకైటభ ప్రమథనీ యాచండ ముండాపః !
యా మాయా మహిషాసుర ప్రమథనీ యా రక్త బీజాపః !!
యాసా శుంభ నిశుంభ సూదనకరీ యాదేవ దేవార్చితా !
సా దేవీ మమ పాతు దేహ మఖిలం మాతా సదా చండికా !!
కుంకుమేన సదాలిప్తే చందనేన విలేపితే !
బిల్వపత్రార్చితే దేవి దుర్గే త్వాం శరణాగతః !!
ఆయుర్దేహి యశో దేహి పుత్రాన్ పౌత్రాన్ ప్రదేహిమే !
సర్వమంగళదే దేవి యశోదేహి ద్విషోజహి !!
సర్వాన్ కామాన్ ప్రదేహిత్వం సర్వ సౌభాగ్యదాయినీ !
తాపత్రయోద్భవ దు:ఖంమమ చాశు నివారయ !!
విష్ణు వక్షస్థలే నిత్యం యథాత్వం సుస్థిరాభవే: !
తథాత్వమచలా నిత్యం మద్గృహే సర్వదావస !!
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వరీ !
యత్పూజితం మాయాదేవి పరిపూర్ణం తదస్తుమే ! 64.

అనేన చతుష్షష్టి ఉపచార పూజనేన భగవతీ సర్వాత్మికా శ్రీ మహాకాళీ మహాలక్ష్మి మహాసరస్వతీ బాలా త్రిపురసుందరీ రాజరాజేశ్వరీ సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు ! అక్షింతలు నీళ్ళు వదిలేయాలి.

# !! దేవీ అపరాధ స్తోత్రం.!!

న మంత్రం నో యంత్రం తదపి చ న జానే స్తుతి మహో
న చాహ్వానం ధ్యానం తదపి చ న జానే స్తుతి కథాః
న జానే ముద్రాస్తే తదపి చ న జానే విలపనం
పరం జానే మాతస్త్వదనుసరణం క్లేశహరణమ్ || ౧ ||

అమ్మానాకు మంత్రాలు తెలియవు,యంత్రాలు తెలియవు. నిన్ను స్తుతిచేసే మతిలేదు. నాకు నిన్నుపాసన చేసే ముద్రలు తెలియవు. ఇవియన్నీ నా బాధలు అని చెప్పుకొని ఏడ్వలేను. నాకు తెలిసినది ఒకటే. నిన్ననుసరించుటయే నా దుఃఖములకు ఉపశమనము.

విధేరజ్ఞానేన ద్రవిణ విరహేణాలసతయా
విధేయా శక్యత్వాత్తవ చరణయోర్యాచ్యుతిరభూత్
తదేతత్ క్షంతవ్యం జనని సకలోద్ధారిణి శివే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి || ౨ ||

నా అజ్ఞానముచేత, అశక్తతచేత, నా సోమరితనము చేత, నా దౌర్బల్యముచేత, నేను పెట్టదలచిన నైవేద్యము నీ పాదములనంటినది. తల్లీ శివా, భవానీ, రుద్రాణీ నన్ను క్షమించు. అందరినీ ఉద్ధరించే తల్లీ నీకు తెలియనిదేమున్నది. చెడ్డ కుమారుడు ఉండటం లోక సహజము కానీ చెడ్డ తల్లి ఉండదు కదా!

పృథివ్యాం పుత్రాస్తే జనని బహవః సంతి సరళాః
పరం తేషాం మధ్యే విరల విరలోzహం తవ సుతః
మదీయోzయం త్యాగః సముచిత మిదం నో తవ శివే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి || ౩ ||

అమ్మా అనేకానేకమైన నీ సుపుత్రుల నడుమ, నాది, నాకు అన్న స్వార్థ పూరిత వాంఛలచే పెనుగొనబడి శమ దమాదులను అధిగమించలేక పడియున్నాను. నాకున్న ఒకే ఒక అర్హత నీ కుమారుని కావటమే. తల్లీ శివాని! అదిచాలదా నన్ను ఉద్ధరించుటకు. అయినా చెడ్డ కుమారుడు ఉండటం లోక సహజము కానీ చెడ్డ తల్లి ఉండదు కదా!

జగన్మాతర్మాతస్తవ చరణ సేవా న రచితా
న వా దత్తం దేవి ద్రవిణమపి భూయస్తవ మయా
తథాపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకురుషే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి || ౪ ||

అమ్మా! జగన్మాతలకు మాతా! నీ పాదసేవ నేను చేసినదేలేదు. నీ పద సన్నిధిన నేనుంచిన నైవేద్యము ఏమీ లేదు. నిరుపమానమైన నీ కనికరమునకు నీ పుత్రుని నుండి అవి నీకు కావలెనా. అయినా చెడ్డ కుమారుడు ఉండటం లోక సహజము కానీ చెడ్డ తల్లి ఉండదు కదా!

పరిత్యక్తా దేవా వివిధ విధ సేవాకులతయా
మయా పంచాశీతేరధిక మపనీతే తు వయసి
ఇదానీం చేన్మాతస్తవ యది కృపా నాzపి భవితా
నిరాలంబో లంబోదరజనని కం యామి శరణమ్ || ౫ ||

అమ్మా! 85 సంవత్సరముల వయసు వచ్చినా నాకు ఏవిధమైన పూజా విధానాలూ తెలియవు. నేను చేయ గలిగినది నీ శరణు కోరడమే. ఎటువంటి ఆశ్రయమునూ లేని నాకు నీవు కాక ఆశ్రయము వేరెవ్వరివ్వగలరు ఓ లంబోదరజననీ!

శ్వపాకో జల్పాకో భవతి మధుపాకోపమగిరా
నిరాంతంకోరంకో విహరతి చిరం కోటికనకైః
తవాపర్ణే కర్ణే విశతి మను వర్ణే ఫలమిదం
జనః కో జానీతే జనని జపనీయం జప విధౌ ‖ ౬ ‖

తల్లీ అపర్ణా! నీమహిమనేమని కొనియాడను. నీ మహిమతో చండాలుడు కూడా మదుర మధురతర మంజుల వాణిని వినిపించగలడు, నిర్ధనుడు కూడా ధనవనమున ధాటిగా నడయాడగలడు, కేవలము నీ నామామృతము వారి కర్ణ రంధ్రములు సోకినచాలును. మరి అంత మహిమగల నీ నామము అనుష్ఠాన నియమములతో అకుంఠితముగా జపించే వారి అదృష్టమును ఏమని కొనియాడవలెను.

చితాభస్మాలేపో గరళమశనం దిక్పటధరో
జటాధారీ కంఠే భుజగపతిహారీ పశుపతిః
కపాలీ భూతేశో భజతి జగదీశైకపదవీం
భవానీ త్వత్పాణిగ్రహణ పరిపాటీఫలమిదమ్ ‖ ౭ ‖

అమ్మా చితాభస్మమును ధరించువాడు, విషమును కంఠమునందు దాచుకున్నవాడు, దిక్కులనే వస్త్రములుగా ధరించినవాడు, జడలు కట్టినవాడు, పాములను ధరించిన వాడు, భుతములతో తిరుగాడువాడు, కపాలములో భుజించువాడు అయిన శివుడిని జగత్ప్రభువు అనుటకు కారణము నీవాయన అర్ధాగివి అగుట వల్లనే కదా అమ్మా!

న మోక్షాస్యాకాంక్షా న చ విభవవాంఛాపి చ న మే
న విజ్ఞానాపేక్షా శశిముఖి! సుఖేచ్ఛాపి న పునః
అత స్త్వాం సంయాచే జనని జననం యాతు మమ వై
మృడానీ రుద్రాణీ శివ శివ భవానీతి జపతః ॥ ౮ ॥

అమ్మా నేను ధన, కనక, వస్తు, వాహన కామినీ కాదు మోక్షగామినీ కాదు, శాస్త్రజ్ఞత కూడా నాలో శూన్యమే. తల్లీ ఇందుముఖీ నాకు ఏ సుఖ సంతోషాలూ వద్దు. నాకు నీవెన్నిజన్మలు కలిగించ బోవుచున్నా అన్ని జన్మలలోనూ నాకు నీ నామములైన "మృడాని, రుద్రాణి, శివా, భవానీ" మొదలయిన వీనినే నేను సదా స్మరించు నటుల చేయి వరంబునీయుము తల్లీ.

నారాధితాసి విధినా వివిధోపచారైః ।
కిం సూక్ష్మచింతనపరైర్న కృతం వచోభిః ॥
శ్యామే! త్వమేవ యది కించన మయ్యనాథే ।
ధత్సే కృపాముచితమంబ పరం తవైవ ॥ ౯ ॥

అమ్మా శ్యామా! నేను వేదచోదితమైన మంత్రపఠనముతో, ఉదాత్తానుదాత్త స్వరములతో, అచంచలమైన భక్తితో నిన్ను కొలుచుటలేదు. నాకు తెలిసినదల్లా నా భాషలో నా ఘోష వినిపించడమే. అయినా నన్ను నీ అక్కున చేర్చుకొన్నావంటే నవనీత హృదయముతో కూడిన నీవు నా హృదయావేదన గుర్తిచ్చినావు. నీవు ఈ జగత్తుకే అతీతురాలివి కదా.

ఆపత్సుమగ్నస్స్మరణం త్వదీయం । కరోమి దుర్గే కరుణార్ణవే శివే ।
నైతచ్ఛఠత్వం మమ భావయేథాః । క్షుధాతృషార్తా జననీం స్మరంతి ॥ ౧౦

అమ్మా దుర్గా! దయా సాగరీ! ఆపదలలో మాత్రమే నిన్ను తలచుతానని "అవసరార్థి నైన" నన్ను అసహ్యించుకోవద్దు. బిడ్డకు ఆకలైతే తలచుకొనేది తల్లినేకదా!

జగదంబ విచిత్ర మత్ర కిం పరిపూర్ణా కరుణాస్తి చే న్మయి |
అపరాధపరంపరావృతం న హి మాతా సముపేక్షతే సుతమ్ || ౧౧ ||

అమ్మా జగన్మాతా! నీవు పోతపోసిన కరుణా మూర్తివి. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు.అందుకే తనయుడనైన నా తప్పులెన్నున్నా తప్పనిసరిగా నన్నుపేక్షింపక నీ అక్కున చేర్చుకొంటావు అమ్మా!

మత్సమః పాతకీ నాస్తి పాపఘ్నీ త్వత్సమా న హి |
ఏవం జ్ఞాత్వా మహాదేవి యథా యోగ్యం తథా కురు || ౧౨ ||

నేనే అధమాధముడను. నాకన్నా అధములు వుండరు కదా.
నాకు మాత్రమే మంచి జరగాలి అనుకుంటూ దాని వలన లోకానికి ఎంత కీడు జరుగుతుందో ఆలోచించనివాడిని, ఏది కోరుకోవాలో కూడా తెలియని వాడిని. అన్నీ తెలిసిన నీవు ఏది యోగ్యమో అది అందజేయు నీకు వందనములు.

# అన్నపూర్ణాష్టకం

నిత్యానందకరీ వరాభయకరీ - సౌందర్యరత్నాకరీ
నిర్ధూతాభఖిలఘోరపాపనికరీ - ప్రత్యక్షమహేశ్వరీ
ప్రాలేయాచలవంశపావనకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 1

నానారత్నవిచిత్రభూషణకరీ - హేమాంబరాడంబరీ
ముక్తాహారవిడంబమానవిలస - ద్వక్షోజకుంభాంతరీ
కాశ్మీరాగురువాసితాంగరుచిరా - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 2

యోగానందకరీ రిపుక్షయకరీ - ధర్మైకనిష్ఠాకరీ
చంద్రార్కానలభాసమానలహరీ - త్రైలోక్యరక్షాకరీ
సర్వైశ్వర్యకరీ తపఃఫలకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 3

కైలాసాచలకందరాలయకరీ - గౌరీ హ్యుమా శాంకరీ
కౌమారీ నిగమార్థ గోచరకరీ - హ్రోంకారబీజాక్షరీ
మోక్షద్వారకవాటపాటనకరీ - కాశీపురాధీశ్వరీ

భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 4

దృశ్యాదృశ్యవిభూతిపావనకరీ - బ్రహ్మాండభాండోదరీ
లీలానాటకసూత్రఖేలనకరీ - విజ్ఞానదీపాంకురీ
శ్రీవిశ్వేశమనఃప్రమోదనకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 5

ఆదిక్షాంతసమస్తవర్ణనికరీ - శంభుప్రియా శాంకరీ
కాశ్మీరే త్రిపురేశ్వరీ త్రిణయనీ - విశ్వేశ్వరీ శ్రీధరీ
స్వర్గద్వారకవాటపాటనకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 6

ఉర్వీ సర్వజయేశ్వరీ జయకరీ - మాతా కృపాసాగరీ
నారీ నాలసమానకుంతలధరీ - నిత్యాన్నదానేశ్వరీ
సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 7

దేవీ సర్వవిచిత్రరత్నరచితా - దాక్షాయణీ సుందరీ
వామా స్వాదుపయోధరప్రియకరీ - సౌభాగ్యమాహేశ్వరీ
భక్తాభీష్టకరీ సదా శుభకరీ - కాశీపురధీశ్వరీ

భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 8

చంద్రార్కానలకోటికోటిసదృశా - చంద్రాంశుబింబాధరీ
చంద్రార్కాగ్నిసమానకుండలధరీ - చంద్రార్కవర్ణేశ్వరీ
మాలాపుస్తకపాశసాంకుశధరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 9

క్షత్రత్రాణకరీ సదా శివకరీ - మాతా కృపాసాగరీ
సాక్షా న్మోక్షకరీ సదా శివకరీ - విశ్వేశ్వర శ్రీధరీ
దక్షాక్రందకరీ నిరామయకరీ - కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ - మాతాన్నపూర్ణేశ్వరీ| 10

అన్నపూర్ణే సదాపూర్ణే - శంకరప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం - భిక్షాం దేహిచ పార్వతి,
మాతా చ పార్వతీ దేవీ - పితా దేవో మహేశ్వరః
బాంధవ శ్శివభక్తాశ్చ - స్వదేశో భువనత్రయమ్|
ఇతిః శ్రీ అన్నపూర్ణాష్టకం సంపూర్ణమ్

# శ్రీ రాజరాజేశ్వర్యష్టకం

అంబా శాంభవి చంద్రమౌళి రబలా పర్ణా ఉమా పార్వతీ
కాళీ హైమావతీ శివా త్రినయనీ కాత్యాయనీ భైరవీ
సావిత్రీ నవయౌవనా శుభకరీ సామ్రాజ్యలక్ష్మీ పదా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 1

అంబా మోహిని దేవతా త్రిభువనీ ఆనందసంధాయినీ
వాణీ పల్లవపాణి వేణు మురళీగాన ప్రియాలోలినీ
కల్యాణీ ఉడురాజ బింబవదనా ధూమ్రాక్షసంహారిణీ
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 2

అంబా నూపుర రత్న కంకణధరీ కేయూర హారావళీ
జాతీ చంపక వైజయంతీలహరీ గ్రైవేయవైరాజితా
వీణా వేణు వినోద మండితకరా వీరాసనా సంస్థితా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 3

అంబా రౌద్రిణి భద్రకాళి బగళా జ్వాలాముఖీ వైష్ణవీ
బ్రహ్మాణీ త్రిపురాంతకీ సురసుతా దేదీప్యమానోజ్జ్వలా
చాముండా శ్రితరక్షపోషజననీ దాక్షాయణీ పల్లవీ

చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 4

అంబా శూల ధనుః కుశాకుశధరీ అర్ధేందు బింబాధరీ
వారాహీ మధుకైటభ ప్రశమనీ వాణీ రమాసేవితా
మల్లాద్యాసుర మూకదైత్యదమనీ మాహేశ్వరీ అంబికా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 5

అంబా సృష్టి వినాశపాలనకరీ ఆర్యా విసంశోభితా
గాయత్రీ ప్రణవాక్షరామృతరసః పూర్ణానుసంధీకృతా
ఓంకారీ వినుతా సురార్చితపదా ఉద్దండ దైత్యాపహా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 6

అంబా శాశ్వత ఆగమాది వినుతా ఆర్యా మహాదేవతా
యా బ్రహ్మాది పిపీలికాంత జననీ యావై జగన్మోహినీ
యా పంచ ప్రణవీరేఫ జననీ యాచిత్కళామాలినీ
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 7

అంబాపాలిత భక్తరాజిరనిశం అంబాష్టకం యః పఠే
దంబాలోక కటాక్ష వీక్షలలితా ఐశ్వర్య మవ్యాహతా
అంబా పావన మంత్రరాజపఠనా దంతే సమోక్షప్రదా
చిద్రూపీ పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ 8

# మహిషాసుర మర్ధిని స్తోత్రం

అయి గిరినందిని నందితమేదిని విశ్వవినోదిని నందనుతే
గిరి వరవింధ్యశిరోధినివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే
భగవతి హే శితికంఠకుటుంబిణి భూరికుటుంబిణి భూరికృతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

సురవరహర్షిణి దుర్ధరధర్షిణి దుర్ముఖమర్షిణి హర్షరతే
త్రిభువనపోషిణి శంకరతోషిణి కిల్బిషమోషిణి ఘోషరతే
దనుజనిరోషిణి దితిసుతరోషిణి దుర్మదశోషిణి సింధుసుతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి జగదంబ మదంబ కదంబవనప్రియవాసిని హాసరతే
శిఖరిశిరోమణి తుంగ హిమాలయశృంగనిజాలయ మధ్యగతే
మధుమధురే మధుకైతభగంజిని కైతభభంజిని రాసరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి శతఖండ విఖండితరుండ వితుండితశుండ గజాధిపతే
రిపుగజగండ విదారణచండ పరాక్రమశుండ మృగాధిపతే
నిజ భుజదండ నిపాటితఖండ విపాటితముండ భటాధిపతే

జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి రణ దుర్మదశత్రువధోదిత దుర్ధరనిర్జర శక్తిభృతే
చతురవిచార ధురీణమహాశివదూతకృత ప్రమతాధిపతే
దురిత దురీహ దురాశయ దుర్మతి దానవదూత కృతాంతమతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి శరణాగత వైరివధూవర వీరవరాభయ దాయికరే
త్రిభువన మస్తకశూలవిరోధి శిరోధికృతామల శూలకరే
దుమి దుమి తామర దుందుభినాదమహోముఖరీకృత తిగ్మకరే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి నిజ హుంకృతి మాత్రనిరాకృత ధూమ్రవిలోచన ధూమ్రశతే
సమరవిశోషితశోణితబీజసముద్భవశోణితబీజలతే
శివ శివ శుంభ నిశుంభమహాహవతర్పిత భూతపిశాచరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

ధనురనుసంగరరక్షణసంగపరిస్ఫురదంగనటత్కటకే
కనకపిశంగ పృషత్కనిషంగ రసద్భటశృంగ హటావటుకే
కృత చతురంగబలక్షితిరంగ ఘటద్భహురంగ రటద్వటుకే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

సురలలనాత తథేయి తథేయి తథాభినయోత్తమనృత్యరతే
హాసవిలాసహులాసమయి ప్రణతార్తజనేమితప్రేమభరే
ధిమికిటధిక్కటధిక్కటధిమిధ్వనిఘోరమృదంగనినాదలతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

జయ జయ జప్య జయేజ్జయశబ్దపరస్తుతితత్పర విశ్వనుతే
ఝుణఝుణఝింఝిమిఝింకృతనూపురశింజితమోహితభూతపతే
నటితనటార్ధనటీనటనాయకనాటితనాట్య సుగానరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అయి సుమనసుమనసుమనసుమనసుమనోహర కాంతియుతే
శ్రితరజనీరజనీరజనీరజనీరజనీకర వక్త్రవృతే
సునయనవిభ్రమరభ్రమరభ్రమరభ్రమరభ్రమరాధిపతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

మహితమహాహవమల్లమతల్లిక మల్లిత రల్లక మల్లరతే
విరచిత వల్లికపల్లికమల్లికఝిల్లికభిల్లికవర్గవృతే
సృతకృతఫుల్లసముల్లసితారుణతల్లజపల్లవసల్లలితే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

అవిరళగండగళన్మదమేదురమత్తమతంగజరాజగతే
త్రిభువనభూషణభూతకళానిధిరూపపయోనిధిరాజసుతే
అయి సుదతీజనలాలసమానసమోహనమన్మధరాజమతే

జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే
కమలదళామలకోమలకాంతిబలాకలితాతులఫాలతలే
సకలవిలాసకళానిలయక్రమకేళికలత్కలహంసకులే
అలికులసంకులకువలయమండలమౌళిమిలద్వకులాలికులే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

కలమురళీరవవీజితకూజితలజ్జితకోకిలమంజమతే
మిలితమిలిందమనోహరగుంజితరాజితశైలనికుంజగతే
నిజగణభూతమహాశబరీగణరంగణసంభృతకేళితతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

కటితటపీతదుకూలవిచిత్రమయూఖతిరస్కృతచంద్రరుచే
ప్రణతసురాసురమౌళిమణిస్ఫురదంశులసన్నఖసాంద్రరుచే
జితకనకాచలమౌళిపదోర్జితదుర్ధరనిర్ఝరతుణ్డకుచే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

విజితసహస్రకరైకసహస్రకరైకసహస్రకరైకనుతే
కృతసురతారకసంగరతారకసంగరతారకసూనునుతే
సురథసమానసమాధిసమానసమాధిసమానసుజాతరతే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

పదకమలం కరుణానిలయే వరివస్యతి యోనుదినం న శివే
అయి కమలే కమలానిలయే కమలానిలయస్స కథం న భవేత్
తవ పదమేవ పరం పదమిత్యనుశీలయతో మమ కిం న శివే
జయ జయ హే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే

కనకలసత్కలశీకజలైరనుషి..తి తెఙ్గణరంగభువం
భజతి స కిం ను శచీకుచకుంభతటీపరిరంభసుఖానుభవం
తవ చరణం శరణం కరవాణి నతామర వాణి నివాశి శివే
జయ జయ హే మహిషాసుర మర్దిని రమ్య కపర్దిని శైలసుతే

తవ విమలేందు కలం వదనేందు మలం సకలం ననుకూలయతే
కిము పురుహూత పురీందు ముఖీ సుముఖీ భిరసౌ విముఖీ క్రియతే
మమ తు మతం శివ నామ ధనే భవతీ కృపయా కుముత క్రియతే
జయ జయ హే మహిషాసుర మర్దిని రమ్య కపర్దిని శైలసుతే

అయి మయి దీన దయాళు తయా కృప యైవ త్వయా భవితవ్య ముమే
అయి జగతో జననీ కృపయాసి యథాసి తథాను మితాసిరతే
యదుచిత మత్ర భవ త్యురరీ కురుతా దురుతాప మపా కురుతే
జయ జయ హే మహిషాసుర మర్దిని రమ్య కపర్దిని శైలసుతే

# శ్యామలా దండకమ్

మాణిక్యా వీణా ముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసామ్
మహేంద్రనీలద్యుతి కోమలాంగీం, మాతంగకన్యాం మనసా స్మరామి
చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః

మరకత శ్యామ మాతంగీ మధుశాలినీ కుర్యాత్ కటాక్షం కళ్యాణీ
కదంబవనవాసినీ
జయమాతంగ తనయే జయనీలోత్పలద్యుతే జయ సంగీతరసికే జయ
లీలాశుకప్రియే

జయ జనని సుధాసముద్రంతరుద్యన్మణిదవీప సంరూఢ బిల్వాటవీమధ్య
కల్పద్రుమా కల్పకాదంబ కాంతారవాసః ప్రియే కృత్తివాసః ప్రియే, సాదరారబ్ధ
సంగీత సంభావనా సంభ్రమాలోల నీపస్రగాబద్ధ చూళీనాథ త్రికే, సానుమత్పుత్రికే,
శేఖరీభూత శీతాంశురేఖా మయూఖావలీనద్ధ సుస్నిగ్ధనీలాలక శ్రేణిశృంగారితే
లోక సంభావితే, కామలీలా ధనుస్సన్నిభభ్రూలతా పుష్పసందేహ కృచ్చారు
గోరోచనా పంకకేళీ లలామాభిరామే సురామే రమే, ప్రోల్లసద్వాళికా
మౌక్తికశ్రేణికా చంద్రికామండలోద్భాసి, గండస్థలన్యస్త
కస్తూరికాపత్రరేఖాసాముద్భూత సౌరభ్య సంభ్రాంత భృంగాగానగీత
సాంద్రీభవన్మంద్రతంత్రీస్వరే భాస్వరే, వల్లకీవాదన ప్రక్రియా లోలతాళీదళాబద్ధ

టాకంకభూషాశేషాన్వితే సిద్ధసమ్మానితే దివ్యహాలామదోద్వేల
హాలాలసచ్చక్షురాందోళన శ్రీ సమాక్షిప్తకర్ణి నీలోత్పలే నిర్మలే. స్వేద
బిందూల్లసత్ఫాలలావణ్య నిష్యందసందోహసందేహ కృన్నాసికామౌక్తికే
సర్వమంత్రాత్రిత్మికే, కుందందస్మితోదార వాక్త్రస్ఫురత్పూగ కర్పూర తాంబూల
ఖండోత్కరే శ్రీకరే, కుందపుష్పద్యుతిస్నిగ్ధ దంతావళీనిర్మలాలోల కల్లోలసమ్మేళన
స్మేర శోణాధరే చారువీణాధరే సులలితనవయౌవనారంభ,
చంద్రోదయోద్వేలలావణ్య దుగ్ధార్ణవావిర్భవత్కంబు బింబోకభృత్కంధరే
మంథరే, బంధురచ్ఛన్న వీరాధివీరాభూషాసముద్ద్యోతమాణానవాద్యాజ్గశోభే
శుభే కేయూర రశ్మిచ్ఛటాపల్లవప్రోల్లసద్దోర్లతారాజితేయోగిభి: పూజితే,
విశ్వదిజ్మణ్డిలవ్యాప్తి మాణిక్య తేజస్స్ఫురత్కంణాలంకృతే సాధుభిస్సత్కృతే,
సమ్గరారంభవేళా సముజ్జృంభమాణా రవింద ప్రతిచ్ఛందపాణిద్వయే
సంతతోద్యద్వయే, దివ్యరాత్నోర్మికా దీధితిస్తోమసంధ్యమానాంగుళీ పల్లవోద్యన్న
ఖెందుప్రభామండలే ప్రోల్లసత్కుండలే,
తారకాజినీకాశహారావళిస్మేరచారుస్తబాభోగభారానామన్మధ్య వల్లీ
వళిచ్ఛేదవీచీసముద్యత్సముల్లస సందర్శితాకార సౌందర్య రత్నాకరే శ్రీకరే,
హేమకుంబహోపమొత్తుజ్గవక్షోజ భారావనమ్రే త్రిలోకానమ్రే లసద్వృతగం
భీరనాభీసరిత్తీర శివాలశంకాకర శ్యామరోమావళీ భూషణే మంజుసంభాషణే,
చారుశింజత్కటీ సూత్రనిర్భర్త్సి తనంగలీలాధనుశ్శింజినీడంబరే
దివ్యరత్నంబరే, పద్మరాగోల్లసన్మేఖలా భాస్వరశ్రోణి శోభాజిత స్వర్ణభూభ్రుత్తలే,
చంద్రకాశీతలే వికసితనవకింశుకాతామ్రదివ్యాంశుకచ్ఛన్న చారూరు
శోభాపరాభూత సిందూర షోణాయమానేంద్ర మాతఙ్గ హస్తార్గళే శ్యామలే,
కొమలస్నిగ్ధనీలోత్పలోత్పాదితానంగతూణీత శంకారరోద్ధామ జంఘాలతే
చారులీలావతే, నమ్రదిక్పాల సీమంతినీ కుంతలస్నిగ్ధ నీలప్రభాకంజ సంజాత

దూర్వాంకురాశంకసారంగసంయోగరింఖన్నఖేందూజ్జ్వలే, దేవి దేవేశ దైత్యేశ యక్షేశ భూతేశ వాగీశ కోణేశ వాయ్వగ్ని మాణిక్య సంఘృష్ట కోటీర బాలాతపోద్దామలాక్షార సారుణలక్ష్మీ గృహీతాం ఘ్రిపద్మద్వయే అద్వయే, సురుచిత నవరత్న పీఠస్థితే, శఙ్ఖపద్మద్వయోపాశ్రితే ఆశ్రితే, దేవి దుర్గావటు అక్షేత్రపాలైర్యుతే, మత్తమాతంగ కన్యాసమూహాన్వితే, భైరవైరష్టాభిర్వేష్టితే, దేవి వామాదిభి స్సంశ్రితే లక్ష్మ్యాది శక్త్యష్టకాసేవితే, భైరవీ సంవృతే పంచబాణేన రాత్యాచ సంభావితే ప్రీతిశక్త్యా వసంతేన చానన్దితే భక్తిం పరంశ్రేయతే కల్పసే, చందసా, మోజపా భ్రాజసే, హాగినాంమానసేధ్యాయ సే గీత విద్యాధియోగాతితృప్తేన సంపూజ్యసే భక్తిమచ్చేతసా వేదసా స్తూయసే విశ్వహృద్యేన వాద్యేన విద్యాధరైర్గీయసే యక్షగంధర్వసిద్ధాఙ్గనా మండలైర్మణ్డలే సర్వసౌభాగ్య వంచావతీభి ర్వధూభిస్సురాణాం సమారాధ్యసే సర్వ విద్యా విశేషాన్వితం చాటుగాథా సముచ్చారణం కంఠముల్లోక సద్వర్ణ రేఖాన్వితం, కోమలం, శ్యామలోదార వక్షద్వయం తుండశోభాతిదూరీభవత్కింశుకాభం శుకం లాలయంతీ పరిక్రీడసే, పాణిపద్మద్వయేనాపరేణాక్షమాలాగుణం స్ఫటికజ్ఞానసారాత్మకం పుస్తక్మ బిభ్రతి యేన సంచింత్యసే, చేతసా తస్య వక్త్రాంతరాద్గపద్యాత్మికా భారతీ నిస్సరే, ద్యేనవా యావకాభాకృతిర్భావ్యసే, తస్య వశ్యా భవంతి స్త్రియః పూరుషా: యేన వా శాతకుంభభాద్యుతిర్భావ్యసే, సోపి లక్ష్మీసహస్రై: పరిక్రీడతే, కిన్నసిద్ధ్యేద్వపుశ్యామలం కోమలం చన్ద్ర చూడాన్వితం తావకం, ధ్యాయతే స్తస్యలీలాసరోవారిధిస్తస్య కేళీవనం నందనం, తస్యభద్రాసనం భూతలం, తస్యగీర్దేవత కింక్రి, తస్యచాజ్ఞాకరీ శ్రీ స్స్వయం, సర్వయంత్రాత్మకే, సర్వమంత్రాత్మకే, సర్వ తంత్రాత్మకే, సర్వ ముద్రాత్మకే, సర్వ శక్త్యాత్మకే, సర్వచక్రాత్మకే, సర్వ వర్ణాత్మకే, సర్వరూపే, హే జగన్మాతృకే, పాహి మాం పాహి మాం పాహి. ఇతి శ్రీ మహాకవి కాళిదాస విరచిత శ్రీ శ్యామలా దండకమ్

# సరస్వతీ అష్టకమ్

యాక్షీరస్ఫతికేందు శంఖధవళా, యా శ్వేత వస్త్రాన్వితా
యా వీణాంకుశ పాశపుస్తకధరా, యాచేంద్ర నీలాకలా
యా రాకాశశిబింబ రమ్యవదనా, యా నేత్ర పద్మోజ్వలా
సాపుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా మాణిక్య విరాజమానమకుటా, యా రక్త బింబాధరా
యా తాలీ దళకర్ణ పత్రలసితా యాదర్శగండస్థలా
యా కస్తూరీ విశేష ఫాల తిలకా యా చంద్రమౌళి ప్రభా
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా ముక్తాఫల రత్ననిర్మితలసన్నాసాగ్ర భూషోజ్జ్వలా
యా మందస్మిత చంద్రికా ధరతలా యా కుంద దంతావళి:
యా రత్నాంగద బాహుయుగ్మ లలితా యాంభోజహస్తోజ్జ్వలా
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసర వాసినీ

యా కుందాబ్జ తుషార హారలసితా యా పూర్ణ కుంభస్తవా
యా రోమావళి రాజితా మృదుతనుర్వ్యాసూక్ష్మ మధ్యాన్వితా
యా గంభీర సునాభికా, కటితటి యా కోమలోరుద్వయా

సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా జానుద్వయ రత్న దండలసితా, తూణీర జంఘాన్వితా
యా శింజన్మణి నూపురాంచిత పదా, యా గూఢ గుల్ఫాన్వితా యా
చింతామణి సూర్యకాంత చరణా యా రక్తవర్ణాంగుళి:
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా శుభ్రాంశు హవిర్భు గర్కనయనా, యా వేద వాగ్వాదినీ
యా నానామణి కామకణాంచితకరా, యా పద్మపీఠాసనా
య బ్రహ్మేంద్ర హరీశదేవ వినుతా, యా భక్తి సంసిద్ధతా
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా లోకావళి మాతృకాఖిలతను ర్యాభక్త చింతామణి
ర్యా పీఠత్రయ వాహినీ భవహరా షట్చక్ర సంచారిణీ
యా పంచప్రణవాత్మికా శ్రుతిమయీయా పంచపూజోత్సుకా
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

యా కాళీ కమలాది నిత్య వినుతా యా మౌక్తికా భూషణా
యా సృష్టిస్థితి నాశకారణ పరా యా భూతపంచాత్మికా
యా నేతీతి నిషేధక శృతిమాతా యా సర్వ ధాత్రీవరా
సా పుష్ణాతు సరస్వతీ భగవతీ, మాం వాసరా వాసినీ

ఇతి తేన కృతం స్తోత్రం, గణేశేన మహాత్మనా శ్రుత్వా జగదా తం వాక్యం,
శుచిహాసా సరస్వతీ
స్తవేనానేత మహతా, త్వత్కృతేన గజానన సంతుష్టా స్మికృతార్ధో సీ దర్శనాన్మేన్య
దుర్లభాత్
ఇదం స్తవం పఠేద్యస్తు మదీయం త్వత్కృతం స్థా స సంసారా ద్విముక్తోమే ప్రాప్నోతి
పరమం పదమ్
వరం వరయం దాస్యామి వాంఛితం తే గజానన యయాచన తదాదేవీమత్వం
దేవాగ్రే ప్రపూజనమ్
ఇతి తద్వచనం శ్రుత్వా జగన్మాతా సరస్వతీ దదౌ తస్మై గణేశాయ వాంఛితం
చాన్య దుర్లభమ్

# సరస్వతీ స్తోత్రం

యా కుందేందు తుషార హార ధవళ యాశుభ్ర వస్త్రాన్వితా
యా వీణా వరదండ మండిత కరాయాశ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిర్ధేవైస్సదా పూజితా
సామాం పాతు సరస్వతీ నిశ్శేష జాడ్యాపహా

దోర్భిర్యుక్తా చాతుర్భి: స్ఫటిక మణ్ణినిభై రక్షమాలాన్దధానా
హస్తేనైకేన పద్మం సితమపి చశుకం పుస్తకం చాపరేణ
భాసాకుందేందు శంఖస్ఫటిక మణి నిభా భాసమానా సమానా
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా

సురావరైస్సేవిత పాదపంకజాకరే విరాజత్కమనీయ పుస్తకా విరించి పత్నీ
కమలాసన స్థితా సరస్వతీ నృత్యతు వాచిమేసదా సరస్వతీ సరిసిజ
కేసరస ప్రభా తపస్వినీసిత కమలాసన ప్రియా ఘనస్తనీ
కమల విలోల లోచనా మనస్వినీ భవతు వరప్రసాదినీ

సరస్వతీ సమస్తుభ్యం వరదే కామరూపిణీ విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమే
సదా
సరస్వతీ నమస్తుభ్యం సర్వదేవీ నమో నమః శాంతిరూపే శశిధరే సర్వయోగే
నమోనమః

నిత్యానందే నిరాధారే నిష్కళాయై నమోనమః విద్యాధరే విశాలాక్షి శుద్ధ జ్ఞానే
నమోనమః
శుద్ధ స్ఫటిక రూపాయై సూక్ష్మరూపే నమోనమః శబ్దబ్రహ్మి చతుర్హస్తే సర్వసిద్ధ్యై
నమోనమః
ముక్తాలంకృత సర్వాంగ్యై మూలాధారే నమోనమః మూలమంత్ర స్వరూపాయై
మూలశక్త్యై నమోనమః
మనోన్మని మహాభోగి వాగీశ్వరీ నమోనమః వాగ్మ్యై వరద హస్తాయై వరదాయై
నమోనమః
వేదాద్యై వేదరూపాయై వేదాంతాయై నమోనమః గుణదోష వివర్జిన్యై గుణదీప్త్యై
నమోనమః
సర్వజ్ఞానే సదానందే సర్వరూపే నమోనమః సంపన్నాయై కుమార్యైచ సర్వజ్ఞేతే
నమోనమః

యోగానార్య ఉమాదేవ్యై యోగానందే నమోనమః దివ్యజ్ఞాన త్రినేత్రాయై దివ్యమూర్త్యై నమోనమః
అర్ధచంద్ర జటాధారి చంద్రబింబే నమోనమః చంద్రాదిత్య జటాధారి చంద్రబింబే నమోనమః
అణురూపే మహారూపే నమోనమః అణిమాద్యష్టసిద్ధాయై ఆనందాయాయ నమోనమః
జ్ఞాన విజ్ఞాన రూపాయై జ్ఞానమూర్తే నమోనమః నానాశాస్త్ర స్వరూపాయై నానా రూపే నమోనమః
పద్మదా పద్మవంశా చ పద్మరూపే నమోనమః
పరమేస్త్యై పరమూర్త్యై నమస్తే పాపనాశినీ మహదేవ్యై మహాకాళ్యై మహాలక్ష్యై నమోనమః
బ్రహ్మ విష్ణు శివాయైచ బ్రహ్మ నార్త్యై నమోనమః కమలాకర పుష్పా చ కామరూపే నమోనమః
కపాలికర్మదీప్తాయై కర్మదాయై నమోనమః
సాయంప్రాత పఠే నిత్యం షాణ్మాసాత్సిద్ధిరుచ్యతే
చోరవ్యాఘ్ర భయం నాస్తి పఠతాం శృణ్వతామపి
ఇదం సరస్వతీ స్తోత్ర మగస్త్య ముని వాచకమ్
సర్వసిద్ధి కరం శౄణాం సర్వపాప ప్రణాశనమ్

# దుర్గా స్తోత్రమ్

విరాటనగరం రమ్యం – గచ్ఛమానో యుధిష్టిరః

అస్తువ న్మనసా దేవీం – దుర్గాం త్రిభువనేశ్వరీమ్

యశోదాగర్భసంభూతాం – నారాయణ వరప్రియాం

నందగోపకులే జాతం – మంగళాం కులవర్ధనీమ్

కంసవిద్రావణకరీం – అసురాణాం క్షయంకరీం

శిలాతటవినిక్షిప్తాం – ఆకాశం ప్రతి గామినీమ్

వాసుదేవస్య భగినీం – దివ్యమాల్యవిభూషితాం

దివ్యాంబరధరాం దేవీం – ఖడ్గఖేటక ధారిణీం

భారావతరణే పుణ్యే – యే స్మరంతి సదాశివాం

తాన్వై తారయతే పాపా – త్వంకే గా మిప దుర్బలామ్

స్తోతుం ప్రచక్రమే భూయో – వివిధైః స్తోత్రసంభవై:

ఆమంత్ర్య దర్శనాకాంక్షీ – రాజా దేవీం సహానుజః

నమోస్తు వరదే కృష్ణే – కుమారి బ్రహ్మచారిణి

బాలార్కసదృశాకారే – పూర్ణచంద్ర నిభాననే

చతుర్భుజే చతుర్వక్త్రే – పీనశ్రోణిపయోధరే

మయూరపించవలయే – కేయూరాంగదధారిణి

భాసి దేవి యథా పద్మా – నారాయణ పరిగ్రహః

స్వరూపం బ్రహ్మ చర్యం చ – విశదం తవ ఖేచరి

కృష్ణచ్ఛవిసమా కృష్ణా – సంకర్షణసమాననా

బిభ్రతీ విపులౌ బాహూ – శక్రధ్వజసముచ్ఛ్రయౌ
పాత్రీ చ పంకజీ ఘంటీ – స్త్రీ విశుద్ధా చ యా భువి
పాశం ధను ర్మహాచక్రం – వివిధా న్యాయుధాని చ
కుండలాభ్యాం సుపూర్ణాభ్యాం – కర్ణాభ్యాం చ విభూషితా
చంద్రవిస్పర్థినా దేవి – ముఖేన త్వం విరాజసే
ముకుటేన విచిత్రేణ – కేశబంధేన శోభినా
భుజంగాభోగవాసేన – శ్రోణీసూత్రేణ రాజతా
భ్రాజసే చావబద్ధేన – భోగేభవేహ మందరః
ధ్వాజేన శిఖిపించానా – ముచ్ఛ్రితేన విరాజసే
కౌమారం వ్రత మాస్థాయ – త్రిదివం పావితం త్వయా
తేన త్వం స్తూయసే దేవి – త్రిదశైః పూజ్యసే పి చ
త్రైలోక్య రక్షణార్థాయ – మహిషాసురనాశిని
ప్రసన్నామే సుర జ్యేష్టే – దయాం కురు శివా భవ
జయా త్వం విజయా చైవ – సంగ్రామే చ జయప్రదా
మయాపి విజయం దేహి – వరదా త్వం చ సాంప్రతమ్
వింధ్యే చైవ నగశ్రేష్టే – తవ స్థానం హి శాశ్వతం
కాళి కాళి మహాకాళి – సింధూనాంపశుప్రియే
కృపానుయాత్రా భూత్యైస్త్వం – వరదా కామచారిణీ
భారావతారే యే చ త్వం – సంస్మరిష్యంతి మానవాః
ప్రణమంతి చ యే త్వాం హి – ప్రభాతే తు నరా భువి
న తేషాం దుర్లభం కించిత్ – పుత్రతో దనతో పివా
దుర్గా త్తారయసే దుర్గే – తత్త్వం దుర్గా స్మృతా జనైః

కాంతారే ష్వవసన్నానాం – మగ్నానాం చ మహార్ణవే
దస్యుభి ర్వా నిరుద్ధానాం – త్వం గతః పరమా నృణాం
జలప్రతరణే ఛైవ – కాంతారే ష్వటవీషు చ
యే స్మరంతి మహాదేవి – న చ సీదంతి తే నరాః
త్వం కీర్తి స్శ్రీర్ ధృతి స్సిద్ధి : హ్రీ ర్విద్యా సంతతి ర్మతి:
సంధ్యా రాత్రి: ప్రభా నిద్రా – జ్యోత్స్నా కాంతి: క్షమా దయా
నృణాం చ బంధనం మొహం – పుత్రనాశం ధనక్షయమ్
వ్యాధిం మృత్యుం భయం ఛైవ – పూజితా నాశయిష్యసి
సోహం రాజ్యా త్పరిభ్రష్ట: - శరణం త్వాం ప్రసన్నవాన్
ప్రణత శ్చ యథా మూర్ధ్నా – తవ దేవి సురేశ్వరి
త్రాహిమాం పద్మపత్రాక్షి – సత్యే సత్యా భావస్వ నః
శరణం భవ మే దుర్గే – శరణ్యే భక్తవత్సలే
ఏవం స్తుతా హి సా దేవీ – దర్శయామాస పాండవమ్
ఉపగమ్య తు రాజాన – మిదం వచన మబ్రవీత్
శ్రణు రాజన్ మహాబాహో – మదీయం వచనం ప్రభో
భవిష్య త్యచిరా దేవ – సంగ్రామే విజయ స్తవ
మమ ప్రసాదా న్నిర్జిత్య – హత్వా కౌరవవాహినీమ్
రాజ్య నిష్కంటకం కృత్వా – భోక్ష్యసే మేదినీం పునః
భాత్రుభి స్సహితో రాజన్ – ప్రీతిం ప్రాప్స్యసి పుష్కలామ్
మత్ప్రసాదా చ్ఛ తే సౌఖ్య – మారోగ్యం చ భవిష్యతి యే
చ సంకీర్తయిశ్యంతి – లోకే విగతకల్మషాః
తేషాం తుష్టాప్రదాస్యామి – రాజ్య మాయు ర్వపు స్సుతం

ప్రవాసే నగరే చాపి – సంగ్రామే శత్రుసంకటే
ఆటవ్యాం దుర్గకాంతరే – గహనే జలధౌ గిరౌ
యే ఇదం పరమ స్తోత్రం – శృణుయా ద్వా పఠేత వా
న తేషాం దుర్లభం కించి దస్మిన్ లోకే భవిష్యతి
య ఇదం పరమస్తోత్రం – శృణుయా ద్వా పఠేత వా
తస్య సర్వాణి కార్యాణి – సిద్ధిం యాస్యంతి పాండవా:
మత్ప్రసాదా చ్ఛ వ స్సర్వాన్ – విరాటనగరే స్థితాన్
న ప్రజ్ఞాస్యంతి కురవో – నరా వా తన్నివాసినః
ఇత్యుక్త్వా వరదా దేవీ – యుధిష్ఠిర మరిందమం
రక్షాం కృత్వాం చ పండూనాం – తత్రై వాంతరధీయత
ఇతి దుర్గా స్తోత్రం సర్వవ్యాధి హరమ్
ఛ్ఛ వ స్సర్వాన్ – విరాటనగరే స్థితాన్
న ప్రజ్ఞాస్యంతి కురవో – నరా వా తన్నివాసినః

# భ్రమరాంబిక అష్టకం

రవి సుధాకర వహ్ని లోచన రత్నకుండల భూషిణి
ప్రవిమలంబుగా మమ్మునేలిన భక్తజన చింతామణి
అవని జనులకు కొంగు బంగారైన దైవ శిఖామణి
శివుని పట్టపురాణి గుణమణి శ్రీ గిరి భ్రమరాంబికా ||

కలియుగంబున మానవులను కల్పతరువై యుండవా
వెలయు శ్రీ గిరి శిఖరమందున విభవమ్మై విలసిల్లవా
ఆలసింపక భక్త వరులకు అష్ట సంపద లీయావా
జిలుగు కుంకుమ కాంతిరేకుల శ్రీ గిరి భ్రమరాంబిక ||

అంగ వంగ కలింగ కాశ్మీరాంధ్ర దేశములందునన్
పొంగుచును వరహాల కొంకణ భూములయందునన్
రంగుగా కర్ణాట మగధ మరాఠ దేశములందునన్
శృంఖలా దేశముల వెలసిన శ్రీ గిరి భ్రమరాంబిక ||

అక్షయంబుగా కాశి లోపల అన్నపూర్ణ భవానివై
సాక్షి గణపతి కన్న తల్లివి సద్గుణావతి శాంభవి
మోక్షమొసగెడు కనకదుర్గవు మూలకారణశక్తివి
శిక్షజేతువు ఘోర భవముల శ్రీ గిరి భ్రమరాంబిక ||

ఉగ్ర లోచన వర వధూమణి యొప్పుగల్గిన భామిని
విగ్రహంబుల కెల్ల ఘనమై వెలయు శోభనాకారిణి
అగ్రపీఠమునందు వెలసిన ఆగమార్థ విచారిణి
శీఘ్రమేకని వరము లిత్తువు శ్రీ గిరి భ్రమరాంబికా ||

నిగమగోచర నీలకుండలి నిర్మలాంగి నిరంజనీ
మిగుల చక్కని పుష్పకోమలి మీననేత్ర దయానిధీ
జగతిలోన ప్రసిద్ధికెక్కిన చంద్రముఖి సీమంతినీ
చిగురుటాకులవంటి పెదవుల శ్రీగిరి భ్రమరాంబికా ||

సోమశేఖర పల్లవారధి సుందరీమణీ ధీమణీ
కోమలాంగి కృపాపయోనిధి కుటిలకుంతల యోగినీ
నా మనంబున పాయకుండమ నగకులేశుని నందినీ
సీమలోన ప్రసిద్ధికెక్కిన శ్రీగిరి భ్రమరాంబికా ||

భూతనాథుని వామభాగము పొందుగా చేకొంటివి
ఖ్యాతిగను శ్రీశైలమున విఖ్యాతిగా నెలకొంటివి
పాతకంబుల పాఱద్రోలుచు భక్తులను చేకొంటివా
శ్వేతగిరిపై నుండి వెలసిన శ్రీగిరి భ్రమారాంబికా ||

ఎల్లవెలసిన నీదు భావము విష్ణులోకము నందున
పల్లవించును నీ ప్రభావము బ్రహ్మలోకము నందున
తెల్లముగ కైలాసమందున మూడులోకము లందున

చెల్లునమ్మ త్రిలోకవాసిని శ్రీగిరి భ్రమరాంబికా ||
తరుణి శ్రీ గిరి మల్లికార్జున దైవరాయల భామినీ
కరుణతో మమ్మేలు యెప్పుడు కల్పవృక్షము భంగినీ
వరుసతో నీ యష్టకంబును వ్రాసి చదివిన వారికి
సిరులనిచ్చెద వేల్ల కాలము శ్రీ గిరి భ్రమరాంబిక ||

# మహాలక్ష్మి అష్టకం

నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురపుజితే ,
శంఖ చక్ర గధా హస్తే, మహా లక్ష్మి నమోస్తుతే
నమస్తే గరుడా రూఢే, డోల సుర భయంకరి,
సర్వ పాప హరే దేవి, మహా లక్ష్మి నమోస్తుతే
సర్వజ్ఞే సర్వ వరదే, సర్వ దుష్ట భయంకరి,
సర్వ దుఃఖ హరే దేవి, మహా లక్ష్మి నమోస్తుతే
సిద్ది బుధి ప్రదే దేవి, భుక్తి ముక్తి ప్రదాయిని,
మంత్ర మూర్తే సద దేవి, మహా లక్ష్మి నమోస్తుతే
ఆద్యంత రహితే దేవి, ఆది శక్తి మహేశ్వరి,
యోగజ్ఞే యోగ సంభూతే, మహా లక్ష్మి నమోస్తుతే
స్థూల సూక్ష్మే మహా రౌద్రే, మహా శక్తి మహోదరే ,
మహా పాప హరే దేవి, మహా లక్ష్మి నమోస్తుతే
పద్మాసన స్థితే దేవి, పర బ్రహ్మ స్వరూపిణి,
పరమేశ జగన్మాత, మహా లక్ష్మి నమోస్తుతే

శ్వేతాంభరధరే దేవీ, నానా అలంకార భూషితే,
జగస్థితే జగన్మాత, మహా లక్ష్మి నమోస్తుతే

మహా లక్ష్మి అష్టకం స్తోత్రం యః పఠేత్ భక్తిమాన్ నరః ,
సర్వ సిద్ధి మవాప్నోతి, రాజ్యం ప్రాప్నోతి సర్వదా
ఏక కాలే పఠే నిత్యం, మహా పాప వినాశనం
ద్వి కాలే పఠే నిత్యం, ధన ధాన్య సమన్వితం
త్రి కాలే పఠే నిత్యం, మహా శత్రు వినాశనం
మహా లక్ష్మిర్ భావే నిత్యం, ప్రసన్నా వరదా శుభా
ఇతి ఇంద్రకృత మహా లక్ష్మి అష్టకం

# ! అష్టలక్ష్మీ స్తోత్రమ్ !

సుమనస వందిత సుందరి మాధవి చంద్ర సహోదరి యేమమయే
మునిగణ మండిత మోక్షప్రదాయని మంజుల భాషిణి వేదనుతే
పంకజ వాసిని దేవసుపూజిత సద్గుణ వర్షిణి శాంతియుతే
జయజయహే మధుసూదన కామిని ఆదిలక్ష్మి సద పాలయమాం

అయికలి కల్మష నాశిని కామిని వైదిక రూపిణి వేదమయే
క్షీర సముద్భవ మంగళ రూపిణి మంత్ర నివాసిని మంత్రసుతే
మంగళదాయని అంబుజ వాసిని దేవగణాశ్రియ పాదయుగే

జయజయహే మధుసూదన కామిని ధాన్యలక్ష్మి పాలయమాం

జయవరవర్ణిని వైష్ణవి భార్గవి మంత్ర స్వరూపిణి మంత్రమయే
సురగణ పూజిత శ్రీఘ్రఫల ప్రద జ్ఞానవికాసిని శాస్త్రసుతే
భవభయహారిణి పాపవిమోచన పాధుజనాశ్రియ పాదయుతే
జయజయహే మధుసూదన కామిని ధైర్యలక్ష్మి పాలయమాం

జయజయ దుర్గతి నాశిని కామిని సర్వఫలప్రద శాస్త్రమయే
రధజగ తురగ పదాతి సమావృత పరిజన మండిత లోకనుతే
హరిహర బ్రహ్మ సుపూజిత సేవిత తాప నివారిణి పాదయుతే
జయజయహే మధుసూదన కామిని గజలక్ష్మి పాలయమాం

అయిఖగ వాహిని మోహిని చక్రిణి రాగ వివర్ధిని జ్ఞానమయే
గునగున వారిధి లోకహితైషిణి స్వరసప్త భూషిత రాననుతే
మనుజ సురాసుర మానవ వందిత పాదయుతే
జయజయహే మధుసూదన కామిని సంతానలక్ష్మి పాలయమాం

జయకమలాసిని సద్గతి దాయని జ్ఞాన వికాసిని గానమయే
అనుదిన మార్చిత కుంకుమ దూసర భూషిత వాసిత వాద్యనుతే
కనకధారాస్తుతి వైభవ వందిత శంకర దేశిక మాన్యపదే
జయజయహే మధుసూదన కామిని విజయలక్ష్మి పాలయమాం

ప్రణత సురేశ్వేరి భారతి భార్గవి శోకవినాశిని రత్నమయే

మణిమ్య భూషిత కర్ణవిభూషణ శాంతి సమావృత హాస్యముఖే
నవనిధి దాయిని కలిమల హారిణీ కామిత ఫలప్రద హస్తనుతే
జయజయహే మధుసూదన కామిని విద్యాలక్ష్మి పాలయమాం

ధిమిధిమి ధింధిమి ధింధిమి ధిధిమి దుందుభి నాద సుపూర్ణమయే
ఘుం ఘుం ఘుమ ఘుమ ఘుం ఘుమ ఘుం ఘుమ శంఖ నిదాన
సువాద్యనుతే వేద పురాణేహాస సుపూజిత వైదికమార్గ ప్రదర్శయుతే
జయజయహే మధుసూదన కామిని ధనలక్ష్మి పాలయమాం.

# ధూమ్రలోచన సంహారం

దేవీమహాత్మ్యాన్ని కొనసాగిస్తూ మేధాఋషి ఇలా చెప్పసాగాడు. ''భక్తులారా ! పరదేవత పలుకులు ఆలకించి క్రోధంతో, చెప్పలేనంత ఆవేశంతో సుగ్రీవ దానవుడు శుంభుని దగ్గరికి వెళ్ళి తనకు తెలిసిన విషయాలన్నీ వినిపించాడు. ఆ మాటలు వింటూనే శుంభాసురుడు తోక తొక్కిన తాచుపాములా బుసలుకొడుతూ అతి బాల సంపన్నుడైన తన సేనాపతి ధూమ్రలోచనుడిని “ధూమ్రలోచనా ! వెంటనే వెళ్ళి ఆ దురహంకారిని బలాత్కారంగా తీసుకురా. ఆమెను రక్షించడానికి ఎవరు ముందుకు వచ్చినప్పటికీ వాళ్ళనందరినీ సంహరించి శీఘ్రమే వెంట బెట్టుకురా” అని ఆజ్ఞాపించాడు.

సుగ్రీవుడు చెప్పిన ఆ మాటలను ఆలకించిన ధూమ్రలోచనుడు ఆవేశంతో ఊగిపోయాడు. అక్కణ్ణుంచి శరవేగంగా హిమగిరి ప్రాంతం చేరాడు. దేవిని ఉద్దేశించి బిగ్గరగా "దేవీ ! నువ్వు తక్షణమే మా శుంభ ప్రభువు సన్నిధికి చేరకుంటే బలాత్కారంగా నీ కేశపాశం పట్టి నేనే తీసుకుపోవలసి వస్తుంది జాగ్రత్త" అంటూ పెద్దపెట్టున ఘీంకరించాడు.

ధూమ్రలోచనుడి హేయమైన, వికృతమైన వాక్కులు విన్న శ్రీ మహాదేవి శాంత గంభీరంగా ఇలా బదులిచ్చింది. "ధూమ్రలోచనా ! శుంభాసురుడు ప్రేరేపించగా వచ్చిన మీరంతా నిస్సందేహంగా మహాపరాక్రమ సంపన్నులే. మీరు నన్ను బలాత్కారంగా తీసుకువెళ్ళగల పక్షంలో నేను చేయగలిగే దేమీలేదు" అంది.

దేవి పలుకులు ధూమ్రలోచనుడికి ఎగతాళిగా అనిపించాయి. దాంతో రెచ్చిపోయి, అంబ మీదికి లంఘించాడు.

ధూమ్రలోచనుడి విపరీత ప్రవర్తనను, రాక్షస చర్యని చూస్తూనే మహామాత క్రోధంతో, ఎర్రవారిన నేత్రాలతో హుంకారం చేసింది. మాత కళ్ళనుండి బయటకు వచ్చిన అగ్నిజ్వాలల్లో పడి ధూమ్రలోచనుడు భస్మీ పటలమైపోయాడు.

అదే సమయంలో జగదంబ వాహనమైన సింహం జూలు విదిలిస్తూ అసురసైన్యంలో ప్రవేశించింది. పంజాదెబ్బలతో కొట్టే, నోటితో కొరికే స్వైర విహారం చేస్తూ అసురసైన్యం సర్వస్వాన్నీ చీల్చి చెండాడింది. వాడిగా ఉన్న గోళ్ళతో అసురుల ఉదరాలు చీల్చివేసింది. పంజా దెబ్బలతో వాళ్ళ మస్తకాలను

తుత్తునియలు చేసింది. దుష్టరాక్షసుల కాళ్ళు, చేతులు, కంఠం అనే తేడా లేకుండా అసురుల అంగాలను కొరికి రుధిర పానం చేస్తూ, మెడపై ఒత్తుగా, విలాసంగా పెరిగిన కేశాలను మహా గర్వంగా, విజయ సంకేతంగా విదిలిస్తూ రాక్షసుల గర్వాన్ని క్షణాల్లో అణచివేసింది. కొద్దిసేపట్లోనే దూమ్రాలోచనుడితో సహా రాక్షస సైన్యసర్వస్వం ఆ మృగేంద్రానికి బలైపోయింది.

ఓంకార రూపిణి , క్లీంకార వాసిని
జగదేక మోహిని, ప్రకృతి స్వరూపిణి ॥

శర్వార్థ దేహిని, సకలార్థ వాహిని
భక్తాఘ దాయిని, దహరాబ్జ్య గేహిని ॥ ఓం కార రూపిణి ॥
మృగరాజ వాహన, నటరాజ నందన
అర్థేందుభూషణ, అఖిలార్థి సోషణ
కాశిక కామాక్షి , మాధురి మీనాక్షి
మము బ్రోవవే తల్లి, అనురాగ శ్రీవల్లి ॥ ఓం కార రూపిణి ॥

# హారతి పాటలు

పల్లవి

లక్ష్మి రావే మా ఇంటికి, క్షీరాబ్ది పుత్రి, మహా లక్ష్మి రావే మా ఇంటికి

లక్ష్మి రావే మా ఇంటికి, రాజీతముగా నిన్ను కొలుతు,

ఎల్ల సంపదల నొసగే, సుందరి సుకుమారి తల్లి -- లక్ష్మి --

చరణము: ౧

ఎట్ల నిను ఎత్తుకుందు నమ్మ, మహాలక్ష్మి తల్లి

ఎట్ల నిను ఎత్తుకుందు నమ్మ.

ఎట్ల నిను ఎత్తుకుందు ఆట్లాడే బాలవు నీవు,

ఇట్లా రమ్మనుచు పిలిచి కోట్ల వరమిచ్చే తల్లి, -- ఎట్ల నిను ఎత్తుకుందు నమ్మ --

చరణం: ౨పసి బాలవైతే ఎత్తుకుందు, మహాలక్ష్మి తల్లి,

పసిడి బుగ్గల పాల వెల్లి,

పూలు పండ్లు తోరణ ములతో, పాల వెల్లి కట్టిన వేదిక పై,

కలహంసా నడకలతోటి, ఘల్లు ఘల్లుల నడిచే తల్లి -- ఎట్టా నిను ఎత్తుకుందు నమ్మ --

చరణం: 3

మల్లె పువ్వులతో, పుజించేము, మహాలక్ష్మి తల్లి,

మనసు మందిరము లో నిను నిలిపేము,

మగువలంత ఒకచో చేరి, మహాలక్ష్మీ రో నిన్ను కొలిచి
సౌభాగ్యం ఇమ్మని నిన్ను, చాల వేడెదము తల్లి -- లక్ష్మీ --

అంభ పరమేశ్వరి  అఖిలాండేశ్వరి
ఆది పరాశక్తి  పాలయమాం
శ్రీ భువనేశ్వరి  రాజరాజేశ్వరి
ఆనంద రూపిని పాలయామం
శివకామేశ్వరి,  శిష్ట రక్షని
చిన్మయ రూపిని పాలయమాం
త్రీ భువన నాయకి, త్రీపుర  సంహారిని
త్రీగున మనోహరి పాలయామం
హంస నిరంజని  హరిహర జనని
ఓంకార  రూపిని పాలయమాం
భాలంబిక నిను భక్తి తో కొలిచితే
బాలుడననుగొని పాలయమాం
గోవింద రూపిని గోధన నాయకి
గంగాధర పతి పాలయమాం
చక్ర త్రిసూల నిడ  మరుక ధరణి
శరణ భక్తులము  పాలయమాం

# లక్ష్మి దేవి హారతి.

సాయంకాల సమయములో సంధ్య దీపారాదనలో
వచ్చెను తల్లి మహాలక్ష్మి, వచ్చెను తల్లి వరలక్ష్మి

మేడలో హారం వేసుకొని కాళ్ళకు గజ్జెలు కట్టుకొని
ఘల్లు ఘల్లు మని వచ్చింది కిల కిల కిల నవ్వింది
అడిగినంత ఇచ్చింది "సాయంకాల"

అందరు కలసి రారండి, పూజలు బాగుగా చేయండి
రకరకాల గాజులు తెండి-ముత్తైదువులకు పంచండి "సాయం"

వజ్ర కిరీటం చుడండి, ముత్యాల హారం చుడండి
నాగాభరణం చుడండి, దేవి రూపం కనరండి "సాయం"

ఆర్తిని బాపు ఆదిలక్ష్మి – ధాన్యమునిచ్చును ధాన్యలక్ష్మి
ధైర్యమునిచ్చును ధైర్యలక్ష్మి – శుభాములనిచ్చును గజలక్ష్మి
వరములనిచ్చును వరలక్ష్మి-సంతానమొసగే సంతానలక్ష్మి
విజయమునిచ్చును విజయలక్ష్మి -విద్యనోసగే విద్యాలక్ష్మి
ధనములనిచ్చును ధనలక్ష్మి

దేవతా ఆరాధన ఎక్కువ చేయండి ! గోసేవ చేయండి , పేదలకు సహాయం చేయండి.




శ్రీకాంత్ శర్మ, హిందూ ధర్మచక్రం.


మా Whatsapp 9849485645. www.hindudharmachakram.com

★★★★★ fb.com/hindhudarmachkram ★★★★ srikrutham.com


సశాస్త్రీయ ముహూర్తములకు - వైదిక కార్యములకు - జాతక సమస్యల నివారణలకు, నవరత్న ధారణా విషయాలకు మరియు సశాస్త్రీయ గృహ ప్రవేశములకు సంప్రదించగలరు.

! ధర్మస్య విజయోస్తు !

!! గోబ్రాహ్మణ ఏభ్యః శుభమస్తు నిత్యం లోకాః సమస్తాః సుఖినో భవంతు !!


M.Srikanth Sharma
Director

Cell: 9849485645




హిందూ ధర్మచక్రం

www.hindudharmachakram.com

 msksharma108@gmail.com  hindhudarmachkram